# తప్పెవరిది?

రచయిత:
"సునీల్"

ప్రచురణ:
లక్ష్మీ బుక్ డిపో
ఏలూరురోడ్ - విజయవాడ - 2

ఈ చిన్నిపొత్తము—

నా బాబాయి

స్వర్గీయ దోర్బల భాస్కరశాస్త్రి

సద్గతస్మృతికి

—అంకితము.



ర చ యి త.

# ఇందులో కథలు



ఈ కథలలోని పాత్రలు
కేవలమూ కల్పితాలు;
ఎవరినీ ఉద్దేశించినవి కావు.

# తప్పెవరిది?

"ఏం...నిన్నే, మాట్లాడవేం? నా ఆరోగ్యం బాగుపడటం నీకు యిష్టంలేదా? చేసుకున్న భర్తకి నువ్వు అన్యాయం చేస్తావా? కమలా, నా మాట వినవూ? ఇకనుంచి నీ అదుపు ఆజ్ఞలలో నడుస్తాగా ఈ సారికి మా నాన్న నడిగి డబ్బు యిప్పించవూ? నిన్ననే పట్టణం వెళ్ళి, డాక్టరుని కలుసుకువచ్చా. నా ఊపిరితిత్తులు పూర్తిగా చెడిపోయాయనీ, తొందరగా వైద్యం చేయించుకోకపోతే మూడుమాసాలకన్నా ఎక్కువకాలం బ్రతకననీ చెప్పాడు. నేనూ మానవుడినేగా? నాకూ జీవితంమీద ఆశఉండడం సహజమేగా! ఈ విశాలమైన ప్రపంచములోని ప్రతి ఆకర్షణీయమైన వస్తువునీ, ఆకర్షించి అనుభవించాలని నా మనస్సు బాధపడుతుందిగా! కమలా నేను యిదివరకు చేసిన తప్పుల్ని మన్నించు. నిజమైన పాతివ్రత్యాన్ని తెలుసుకోనలేక దుర్మార్గాలు పట్టా. ఎన్నో పాపపుకృత్యాలు చేశా. ఈ సారి నేను ఆస్పత్రిలో తప్పక చేరుతాగా. నాకు ప్రాణభిక్షపెట్టవూ? నాన్న నీ మాట తప్పక వింటాడు. నన్ను

రక్షించు కమలా'' అంటూ ఒక్కసారిగా ఎదురుగుండా నుంచున్న కమల కాళ్ళమీద పడ్డాడు మోహన్.

కరడుగట్టిన ఆమె మనస్సు నీరయిపోయింది. పాషాణంగా మారిన ఆమెహృదయం నవనీతంగా కరిగింది. భర్త చెడుమార్గాలుపట్టి తన ముఖమైనా చూడటం లేదని ఆమె శరీరంలోని ప్రతి రక్తబిందువూ లజ్జపడింది. ఈ సారి యింటికి వచ్చినపుడు భర్తను గట్టిగా మందలిద్దామని అనుకున్న ఆమె భావాలు, ఒక్కసారిగా పటాపంచలయినాయ్. క్రొత్తభావాలు ఆమెలో ప్రవేశించినాయ్. ఆ భావాలకి సరియైన సమాధానం చెప్పుకునే తీరిక ఆమెకు లేకపోయింది. భర్త మోహన్ మాటలు ఆమెను ఒక్కసారి కదిలించివేశాయ్. ఆమె శరీరంలో లజ్జపడిన ప్రతిరక్తబిందువూ జాలిగా మారిపోయింది. ఆమెలో రేగిన నూతనభావాలకి లేతమనస్సు తట్టుకోలేకపోయింది. ఆమెకు శిరమెత్తినట్లయింది. భర్తముఖం చూసేసరికి ఆమెకు కళ్ళవెంబడ నీళ్ళుకారటం మొదలుపెట్టినాయ్. భర్తకి ఆమెముఖం చూపించటానికి సిగ్గుపడింది. "లేవండి డబ్బు యిప్పిస్తాను" అని చెబుదామనుకున్నది. కాని శరీరంలో ఏ మూలో దాగిన లజ్జ ఆమెను యిబ్బంది పెట్టింది. ఆమెలో రేగిన నూతనభావాలు, మారుమూలదాగిన లజ్జతో సిగ్గు అణిగిపోయినాయ్, కాని 'ఈ సారికి చూద్దామని' ఆమెమనస్సు స్థిరనిశ్చయానికి వచ్చింది.

"కమలా మాటలాడవూ? నాకు ప్రాణభిక్ష పెట్టవూ? నన్ను ఆపదనుండి రక్షించవూ, నాకు వాగ్దానమివ్వవూ?

చేసుకున్న భర్త యింతగా బ్రతిమాలుతుంటే సమాధాన మైనా చెప్పవూ? నీకు ఇది న్యాయమేనా? ఆనందమా, సంతోషమా? భర్తప్రాణాలు పోతే నీకు సౌభాగ్యం వస్తుందను కుంటున్నావా? నీకు వైధవ్యం ప్రాప్తిస్తుందని నీ మనస్సు ఊహించలేకపోయిందా! భర్త యింతగా ప్రార్థిస్తుంటే ఈష న్మాత్రమైనా కరుణ లేకపోయిందా? నీది హృదయమా లేక పాషాణమా? నీవు మానవమాత్రురాలవేనా? సహజంగా లోకంలో స్త్రీలందరూ అబలలంటారే! వాళ్ళేమైనా పిచ్చి వాళ్ళా? నీవు అబలగా లేవే! ఆఖరుసారి అడుగుతున్నా; నన్ను రక్షించవా, నాకు డబ్బు యిప్పిస్తానని వాగ్దానమివ్వవా? మాటలాడవుకదూ! అయితే నీ కాళ్ళముందరే నా ప్రాణాలు విడుస్తా'' అంటూ మోహన్ తలను నేలకేసి బాదుకోసాగాడు.

ఆ దృశ్యాన్ని చూస్తున్న కమల లేతహృదయం తట్టు కోలేకపోయింది. అప్రయత్నంగా ఆమె నోటినుంచి ముత్యాల లాంటి ముచ్చటైన మాటలు మోహన్ చెవుల పడ్డాయి:

"మోహన్, సరే! రేపు ఉదయం మామగారిని అడు గుతాలే'' అన్నది.

ఆ మాటలు చెవునపడేసరికి మోహన్ లేచి నుంచు న్నాడు. ఆమెమీద ఎక్కడలేని ఆప్యాయతా, ప్రేమా ప్రక టించాడు.

''కమలా, నువ్వే నిజమైన భార్యవి! నీవే ఆదర్శవంతు రాలైన గృహిణివి. ఇదిగో ఇటు చూడు...అదేమిటి కళ్ళ వెంబడి నీళ్ళుకారుతున్నాయ్. ఛీ, ఎందుకు ఏడుస్తావ్? నే

నున్నాగా, భయమెందుకు?" అంటూ కళ్ళవెంబడి కారుతున్న నీళ్ళు తుడిచి, ఆమెను తన హృదయానికి హత్తుకున్నాడు మోహన్.

ఆమెకు ఒంటిమీద గొంగళిపురుగు ప్రాకినట్లయింది. అతనిచేతుల్లోనుంచి బయటకు తప్పించుకుంది,

మాట అన్నదే గాని మనస్సులో బాధ ఎక్కువైంది. మరుక్షణంలోనే ఆమెను స్నేహభావం ఆవరించింది. తన ముఖాన్ని చూడటానికి ఒకరోజున అసహ్యపడిన భర్తకి ఈ నాడు తను సహాయం చేయాలి! ఉన్న ఆస్తినంతా అమ్మి తన సౌభాగ్యం కోరి, ఏదో సుఖం అనుభవిస్తుందని ఆశించిన తల్లిదండ్రులను బాధపెడ్తున్న తనభర్తకు ఈ నాడు సహాయం చేయాలి! అందరి మనస్సులనూ బాధపెడుతున్న తనభర్తకి ఈ నాడు సహాయం చేయాలి! అవసరము వచ్చినప్పుడు సక్రమ ఉపాయాలు చూపించి వందలు వేలుగా డబ్బు గుంజుతున్నాడని తెలుసుకుని కూడా ఈ సారి; ఒక్కసారి సహాయం చేయాలి అని ఆమె మనస్సు నిశ్చయించుకొంది. ఈ ప్రేమకు అమితమైన అనురాగానికి కారణమేమిటని ఆమె మనస్సు ప్రశ్నించుకోలేకపోయింది. 'ప్రేమ' అంటే ఏమిటో తెలియని మనస్సులో 'ప్రేమ' అని సమాధానపరచుకొంది. ఎందుకు ప్రేమ, ఎచ్చట ప్రేమ, ఎలాంటి ప్రేమ ఉండాలి అనే భావాలు మరుక్షణంలోనే రగుల్కొన్నాయ్.

'ప్రేమ' అనే పదానికి అర్థం ఏమిటి? చెడుమార్గాలు [illegible] జీవితాన్ని నాశనం చేసుకుంటున్న భర్తకి ప్రేమ చూపించి

మరి నాశనం చేయటం ప్రేమకు లక్షణమా!...ఇప్పుడు ప్రేమ చూపిస్తే భర్త బాగుపడతాడా? ఎందుకు ఈ సమయంలో ప్రేమ? భర్తను తిరస్కరించి డబ్బు యివ్వరని చెప్పినా అది ప్రేమ అవుతుందని ఆమె మనస్సు ఊహించలేకపోయింది.

భర్తమీద ప్రేమ చూపించాలా; ఆగ్రహించాలా? ఆగ్రహిస్తే సంఘానికి దూరమైపోతానేమో! బంధువర్గానికి విరోధినవుతానేమో! సమాజము నన్ను అవమానించి అవతలికి నెట్టివేస్తుందేమో! సమాజానికీ, బంధువర్గానికీ పనికిరాని వ్యక్తి ఈ భూమిమీద బ్రతకటం దేనికి? సంఘాన్ని తిరస్కరించటానికి ఏ స్త్రీ ధైర్యం చేస్తుంది? సంఘ దురాచారాలకి కట్టుబడి, తిరస్కరించలేక, నోరు నొక్కుకొని ఎంతమంది స్త్రీ పురుషులు మానవత్వపు మర్యాదలకోసం అగచాట్లుపడుతున్నారు! అన్ని అగచాట్లనూ కమల తలపోసింది. సంఘంలో ఉన్న క్రుళ్ళును బయటకు తీసి పారవేయవలసిన బాధ్యత సంఘంలో సంచరించే ప్రజలమీదనా ఉన్నదా లేక దేవునిమీద ఉన్నదా? సంఘదురాచారాలకి కట్టుబడి జీవితాన్ని నాశనం చేసుకోవలసిందేనా? భార్య జీవితాన్ని నాశనం చేసి యింటిల్లపాదినీ నరకం అనుభవించమని వదిలివేసిన మోహన్ని సంఘం గౌరవించదా! అతన్ని ఆదరించదా! చేతిలో డబ్బు ఉన్నంతకాలం సంఘం గౌరవిస్తుంది, ఆదరిస్తుంది! కాని భర్తచేత తిరస్కరింపబడి తన జీవితాన్ని నాశనం చేసుకుంటున్న కమల ఎదురుగా మాట్లాడితే సంఘం హర్షిస్తుందా? ఒక్కసారిగా గాలివాన వచ్చి చెట్టు విరిగి మీద పడినట్లు శాపనార్థాలు పడ[illegible]

ఒకజీవిన్ని జీవితాంతంవరకూ తిరస్కరిస్తుందే! నీచప్రబతుకు బ్రతికిందంటారే; భర్తను ఎదిరించిన భార్య అవుతుందే! ఇలాంటి సంఘానికి, సమాజానికి తలఒగ్గాలా, అక్కర్లేదా అను సమస్యను ఆమె మనస్సు ప్రస్తావనకు తీసుకురాలేకపోయింది.

మామగారు యేబదియేండ్ల ముసలివాడు. ముడుతలుబడిన శరీరం, చేతిలో కర్ర, ముసలివాళ్ళకి ఉండవలసిన లక్షణాలన్నీ ఆయనలో స్ఫురిస్తాయి. గదిలో ఒక్కరే మంచంమీద పడుకొని ఉంటారు. ముసలివాళ్ళకి కాలక్షేపం ఏం కావాలి? గతచరిత్ర అంతా జ్ఞప్తికి తెచ్చుకుంటూ కాలం వెళ్ళబుచ్చుతారు. కాని సోమయ్యగారి వార్ధక్యం అలాంటి వార్ధక్యం కాదు. సకల ఐశ్వర్యాలూ ఉన్న మానవుడికి మనస్సుకు సంతోషం లేనిదే సౌఖ్యం అనుభవించలేడని ఆయన దగ్గర లోకానికి చాటుతుంది. పెద్దఆసామి, దొడ్డినిండా గొడ్లు, పాడిపంటలతో కలకలలాడుతున్న కుటుంబానికి మోహన పిల్లముచ్చు అయ్యాడు! సంఘంలో పేరుప్రతిష్టలతో మూర్మ్రోగుతున్న కుటుంబానికి కళంకం తెచ్చినవాడయ్యాడు. మోహన్ లోకానికి మిత్రుడే, సంఘానికి ఆప్తుడే, సమాజానికి పుత్రుడే.

"మామగారూ! ఈ సారికి...అంటే ఆఖరుసారి అన్న మాట. వైద్యం చేయించుకుంటానని ప్రార్థేయపడుతున్నారు; తప్పులు చేయటం మానవునికి సహజమేగా! ఈసారి డబ్బు ఇచ్చి చూద్దాము. పరివర్తన వస్తే మనమంతా అదృష్టవంతులం" అని చెప్పింది కోడలు.

"అమ్మాయీ, కమలా! ఇంకా ఎందుకమ్మా [illegible] పిచ్చి? వాడికి పరివర్తన రాదు, మనం బాగుపడం. వాడు జీవితసమస్యలను ఎదుర్కొనలేని నిర్భాగ్యజీవి. వాడేమిటి; ఎవరైనా, జీవితనౌకని సరిగా జాగ్రత్తతో, ఓపికతో నడపలేకపోతే సాగరంలో తుఫానువచ్చి బోటు మునిగిపోయినట్లు, నామమాత్రం లేకుండా అణగిపోవలసిందే" అన్నాడు సోమయ్య.

"లేదు మామగారూ! ఈసారి, ఆఖరుప్రయత్నం చేద్దాం. నేను ఆయనకి భార్యనయిన తరువాత కష్టసుఖములు అనుభవించవలసిన బాధ్యత నాదేగా! ప్రతిగృహిణి ధర్మమూ భర్త దుర్మార్గములుపడుతుంటే సన్మార్గమునకు త్రిప్పుటయేగా? తన జీవితాన్నంతటినీ నాశనం చేసుకొని భయపడక, ధైర్యసాహసాలతో భర్తను సన్మార్గమునకు త్రిప్పుటకు ప్రయత్నించుట భారతమహిళలకు పరిపాటేగా?"

"కమలా ఎన్నిసార్లు నువ్వు మోసపోలేదమ్మా? ఒక మానవుడు ఒకసారి, రెండవసారి మోసగించిన తరువాత మూడవసారి అతనిని నమ్మేది ఎట్లాగమ్మా? శాంతము, సహనము కావాలని ప్రబోధించేవారందరికి ఇలాటి అనుభవాలు లేకుండా లోకానికి చాటి సంఘంలోని ఇతరజీవుల ప్రాణాలు తీస్తారు."

"మామగారూ! తొందరపడకండి. జీవితంలోవచ్చే సమస్యలలో ఇది ఒక్కటి. ఇలాటి చిన్నసమస్యలకే శాంతి సహనములు పనికిరావంటే ఎట్లా చెప్పండి? ఆ చెప్పిన వ్యక్తులు కూడ అనుభవంమీద చెప్పినమాటలే అవి!"

"సరే కానీయమ్మా ! నీ యిష్టం, తరువాత [illegible] కోవలసింది నీవే గా. ఇదిగో తాళంచెవులు – తీసుకొని ఎంత కావాలో అంతా యిచ్చివెయ్యి. నాకు వాడు బాగు పడ్తాడని, పరివర్తన వస్తుందని ఏమాత్రమూ ఆశాలేదు."

"లేదు మామగారూ! నిరాశపడకండి. నిరాశా, నిస్పృహలకి జీవితంలో తావివ్వకూడదు."

తాళంచెవులు తీసుకొని బీరువాలోనుంచి అయిదు వందల రూపాయలు నోట్లు తీసి హాలులోనికి ప్రవేశించింది.

రొట్టెముక్క చేతిలో నుంచుకొని కుక్కకి ఎదురుగుండా నిలబడితే శునకరాజం ఎంత ఆరాటపడుతుందో, అంత ఆరాటపడుతూ కుర్చీలో కూర్చున్నాడు మోహన్. డబ్బు ఎప్పుడు చేతిలో పడుతుందా, ఎప్పుడు పట్నం పారిపోదామా అని ఆలోచిస్తోంది అతని మనస్సు!

"మోహన్ ! ఇదిగో డబ్బు. వ్యాపారం చేసుకుంటానని హామీ యిచ్చి మామగారిదగ్గర తీసుకున్నాను. నీవు ఎన్నిసార్లు మన్నల్ని మోసగించలేదు. [illegible]"

అయిదునోట్లూ అందుకొని భార్యకాళ్ళకి దణ్ణం పెట్టాడు. "కమలా రేపు ఉదయం 'మెయిల్'కి పట్నం వెళ్తా" నన్నాడు.

* * *

## 2

ప్రశాంతమైన పల్లెటూరి వాతావరణాన్ని వదిలి, ఫ్యాక్టరీల పొగతో, ఉప్పుడుబియ్యం మిల్లుల దుర్గంధంతో; వీధుల్లో

విహరించే మునిశిపాలిటీ ఏనుగుల స్వాగతంతో బస్తీ వాతావరణానికి విచ్చేసాడు మోహన్.

పెద్దవిశాలమైన భవనం. భవనంచుట్టూ తోట, తెల్లని జాజిపందిళ్ళు, వివిధరంగుల గులాబిమొక్కలు, మధ్యమధ్య ఎలక్ట్రిక్ బల్బులు, యింటిముందర గేటుకు అటుయిటూ సింహాములు అమర్చిఉన్నాయి. టాక్సీవచ్చి గుమ్మందగ్గిర ఆగింది. కారు హారన్ మోగింది. ఆ మ్రోతవిని పైనుంచి క్రిందకు యిరువదేండ్ల యువతి దిగివచ్చి గేటు తలుపులు తెరిచింది. జార్జెట్టు చీరె, రవిక ధరించింది. నవనాగరికత లక్షణా లన్నీ ఆమెలో ప్రస్ఫుటమవుతున్నాయి. ఒకచేతిలో బెడ్డింగు, మరొక చేతిలో బుట్ట పుచ్చుకొని గేటుదగ్గర నుంచున్నాడు మోహన్.

"ఆ బెడ్డింగు యిటు తే, నేను తెస్తాగా, నీకు అంత భారం దేనికీ" అన్నది సుజాత.

"ఫరవాలేదులే, నేను తెస్తానులే" అని రెండవచేతిలో నున్న బుట్ట ఆమెచేతి కిచ్చాడు. సుజాత బుట్ట నందుకొంది, ఇద్దరూ మేడమెట్లు ఎక్కారు.

"మీ యింటిదగ్గర అంతా కులాసా?" అని కుశల ప్రశ్న వేసింది సుజాత.

"ఆ... దేముడిదయవలన, ఆయన కరుణాకటాక్ష వీక్షణాలు నేటివరకూ ప్రసరించటంచేత, అందరూ కులాసాగానే ఆనందంతో ద్వేషాలు లేకుండా ఉన్నారు."

"అదేమిటి మోహన్. ఒకయింటిలో తల్లిదండ్రులమధ్య ద్వేషాలు ఎందుకు వస్తాయి? ఇది లోకవిరుద్ధంగా ఉందే?"

"లేదు సుజాతా! నీవు చాలా పాతకాలంలో ఉన్నావు. నేటి సంఘంలో భార్యాభర్తల మధ్య, అన్నదమ్ముల మధ్య, అత్తాకోడళ్ళమధ్య విద్వేషాలు లేకుండా లేవు. కొంతవరకు పేదప్రజలు, మధ్యతరగతి కుటుంబాలవారు బయటపడుతున్నారు. ధనవంతులు, హోదాకల కుటుంబాలలో వారు ఎన్ని విద్వేష, వైషమ్యాలున్నా బయటపడరు. ఇదే లోకం తీరు. నేను గ్రహించినరీతి."

"సరేలే! నీ వేదాంతం విన్నా గాని, నీ చెల్లెలు కమల కులాసాగా ఉన్నదా."

"నా చెల్లెలు కమలా...ఆఁ...మరచిపోయాను. కులాసాగానే ఉన్నది."

"అదేమిటి మోహన్! చెల్లెలి మాటే మరచిపోతున్నావ్?"

"లేదు సుజాతా! కాస్త ప్రయాణంచేసి వచ్చేసరికి మతి వేడెక్కి, సరిగా పనిచేయటం లేదు."

"కాఫీ త్రాగుదువుగాని లోపలికిరా" మోహన్, సుజాతలు లోపలికి ప్రవేశించారు.

* * *

సుజాత, మోహన్ల కలయిక విచిత్రఘటనగా జరిగింది. అంతకుపూర్వం ఒకరిముఖం ఒకరికి తెలియదు. సుజాత ధనిక కుటుంబములో జన్మించిన యువతి. తండ్రి ఆమె చిన్న

తనంలోనే చనిపోయాడు. ఒకత్తే కూతురుగదా అని ఆమె తల్లి సుజాతను కంటికి రెప్పలాగ గారాబంగా పెంచింది. సుజాత కాలేజీ విద్యాభ్యాసానికి వచ్చేసరికి ఆమె తల్లి కూడ చనిపోయింది. ఆమె మనస్తత్వాన్ని కన్నతల్లే సరిగా తెలుసుకోలేకపోయింది. "ఆమెలాంటి యువతులు ఇంకా భారత దేశంలో ఉండబట్టే స్త్రీ జాతి ఈ నాటికీ గౌరవం నిలబెట్టు కుంది" అనుకునేది. సుజాత కాలేజీ విద్యాభ్యాసం చేసిందనే సరికి అనేకమంది అనేకరకములుగా ఊహలు చేసేవారు. కాలేజీ కుర్రవాళ్లు ఆడపిల్లల్ని ఏడిపిస్తారని, నీచభావంతో చూస్తారని ఊహించేవారు. కాని సుజాత వచ్చిందనేసరికి కాలేజీలో కలిగే చైతన్యం ఆశ్చర్యం కలిగించేది. పెద్ద గాలివాన వచ్చి వెలసినట్లుగా ఉండేది కాలేజీ వాతావరణం. ఆమె అంటే ప్రతివారికీ గౌరవం. ఆమె ఇతరులయందు చూపించే ఆదరాభిమానములే కాలేజీ విద్యాభ్యాసకాలంలో గౌరవ స్థానాన్నిచ్చాయి. చదువు పూర్తి అయిన తరువాత కూడ సంఘంలో ఆ గౌరవం నిలబెట్టుకొనగలిగింది సుజాత.

విజయవాడ పెద్దబజారులో రాత్రి పన్నెండుగంటల వరకూ జనసమర్ధం ఎక్కువగా ఉంటుంది. ఒకనాడు రాత్రి మూలమీద ఉన్న వెంకటేశ్వరరావుగారి బట్టలకొట్టుదగ్గర రిక్షా ఆగింది. రిక్షాలోనుంచి సిల్కుబట్టలు కట్టుకొని, చేతిలో సంచీ పుచ్చుకొని దిగింది సుజాత. ఆమె సంచీ పైన తెరచి డబ్బులు రిక్షావాడిచేతిలో పెట్టింది. రిక్షావాడు మనస్సులో

సంతోషపడి ఆమెను మనస్సులో దీవించి "సద్గుణం[illegible] [illegible]గారు" అని పట్టలేని సంతోషంతో వెళ్ళిపోయాడు.

బస్తీలలో వివిధజాతులవారు, వివిధమతాల [illegible] కలవారు, సత్యవంతులు, ధర్మపరులు, [illegible], మోసగాళ్ళు, ఒకరేమిటి, పైకి టీపుటాపుగా బట్టలు వేసి [illegible] మోసగించే యువకులు—అందరూ వుంటారు. అందులో [illegible] పెద్దబజారు సామాన్యస్థలం కాదు గదా!

రిక్షావాడి చేతిలో డబ్బుపెట్టి ఆమె కొట్లో [illegible] బేరానికని వెళ్ళింది. ఆమె బేరం చేస్తుండగానే ఒక [illegible] కొట్లో ప్రవేశించాడు. పైనామాఫాంటు, సిల్కు [illegible] వేసుకున్నాడు. ఆతనిముఖంలో మాత్రం దీనస్థితిలో ఉన్నట్లు లాగ ప్రస్ఫుటమవుతోంది. అటూయిటూ దిక్కు [illegible] బజారువెంట నడవటం యువకులకు సామాన్యమే. ఆ దృష్టి [illegible] శేశ్వరరావుగారి బట్టల దుకాణంమీద పడింది. [illegible] మెరసినట్లుగ ఆమెముఖం మెరుస్తూ, సిల్కు-చీర [illegible] అతని కంటబడింది సుజాత. ఆ యువకుని మనస్సు ఇనుము అయస్కాంతముచే ఆకర్షింపబడినటుల ఆమె అందముచే ఆకర్షింపబడింది. గబగబా కొట్లో ప్రవేశించాడు.

అప్పుడే సుజాత ఖరీదుగల సిల్కు-చీర బేరంచేస్తోంది. తనూ ఆ చీరే బేరం చేయాలి అని అనుకున్నాడుగాని జేబులో కాఫీ త్రాగటానికికూడా డబ్బులేదు. కాని అతను వేసిన దుస్తులు అందరినీ ఆకర్షించినాయి. అతను ఏమిచేయాలో తోచక అక్కడే నిలబడిపోయాడు. సుజాత బట్టబేరంచేసి

కెల్లు ప్రాయించింది. వెనుతిరిగి చూచేసరికి క్రొత్తదుస్తులు ధరించి ఉన్న యువకుడు కనబడ్డాడు. వెనుతిరిగి చూచిందో లేదో అయిదుగురు మనుష్యులు కర్రలు పుచ్చుకొని కోట్లో ప్రవేశించారు. అయిదుగురు మనుష్యులూ కలసి ఆ యువకుని పట్టుకున్నారు. ఆ యువకుని ముఖం ప్రొద్దుననుంచీ ఆహారం లేకపోవటంవల్ల నేమో నీరసించి కళావిహీనమయింది. ఆ వచ్చిన మనుష్యులు ఎవరో ఆ యువకుడు గ్రహించలేకపోయాడు.

అతడు వంచినతల, మరల పైకెత్తలేకపోయాడు. వచ్చిన అయిదుగురుమనుష్యులూ పెద్దమస్తాదులులాగా ఉన్నారు. అందులో ఒకడు "వెతకండిరా జేబులు, ఎంతకాలమని ఊరుకుంటాను" అని కర్ర పైకెత్తాడు.

మరియొకడు అందుకొని "డబ్బు అందరికీ కనబడేలా ఉంచుతాడా? ఏ మూలదాచాడో, సరిగా వెతకండిరా!" అని పంచె బిగించాడు.

ఇంకొకడు అందుకొని "అయినా ఎంతకాలమని ఊరుకుంటావు? ఇలాంటివాళ్లు ఊళ్లమీద, పట్నాలమీదపడి ఎంత మంది కొంపలు తీస్తున్నారో! సరిగ్గా వెతకండిరా" అని తలపాగా బిగించాడు.

ఈ దృశ్యాన్ని చూస్తున్న సుజాత లేతహృదయం తట్టుకోలేకపోయింది. ఆమెదృష్టి ఆ యువకునివైపు మరలింది. అతని ఆకారం చూచేసరికి ఆమెకు ఆశ్చర్యం కలిగింది. కలవారి బిడ్డలాగ కనబడ్డాడు. అతనిముఖం చూచేసరికి ఆమెలో జడుపు, జాలి అవతరించినాయి. అతనికళ్ళు గుంటలుపడివున్నాయి. వచ్చి

చుట్టుముట్టిన ఆ మనుష్యులు పంచెలు బిగించి, ఆ యువకునిమీద చేయి వేయబోయేసరికి సుజాత "ఆగండి" అని గద్దించింది. ఆమె సింహగర్జనకు చుట్టూవున్న జనం ఆశ్చర్యచకితులై ఆమె వంకకు దృష్టిపోనిచ్చారు. ఆమెలో ఏమాత్రమూ బెదురు కలుగలేదు. కళ్ళు ఎర్రబడినాయి. తీవ్రకోపం వచ్చింది. చూస్తోన్న వారందరికీ ఆమెముఖం చూచేసరికి భయం వేసింది.

"ఎందుకు అతనిమీద చేయి వేస్తారు...మీకు ఏం కావాలో చెప్పండి, నేను ఇస్తా" అని సుజాత సంచీ బొట్ట ఊడదీసింది.

ఈ దృశ్యాన్నంతటినీ చూస్తోన్న వచ్చిన మనుష్యులు వెనక్కి తగ్గారు. ఎత్తినకర్రల్ని దించివేశారు. ఇంతలోకి బజారులో ఉన్న జనంఅంతా చుట్టుముట్టారు. కర్రలు క్రింద పడవేసిన మనుష్యులు మాట్లాడలేకపోయారు.

వారు అమాయకులు. లోకజ్ఞానమే లేనివాళ్ళు, వారికి ఏమీ తెలియదు. ఈ అమాయకప్రజల అండచూసుకొని ఎంతమంది సంసారాల్లో కూళ్ళు మనుష్యులు లేకపోతే, వర్తక వ్యాపారమనేపేరుతో ప్రభుత్వమువారివద్ద లైసెన్సులు పొందామని చెప్పుకుంటూ అవసరము వచ్చినవారికి ఆదుకుంటామని గొప్పలు చెప్పుకుంటూ, డబ్బు వందల పెట్టుబడి పెట్టి, వాటిని సరియైన కాలానికి ఇవ్వకపోతే, ఆ అమాయకప్రజలకి ధన ఆశ చూపించి, బజారులో నిలబెట్టించి, ఇండ్లపై దొమ్మీలు చేయించేవారికి వీరు రక్షకభటులు. ఈ విధంగా ఈ అమాయక ప్రజలు సత్యాన్ని గ్రహించలేక, జ్ఞానవిహీనులు కాబట్టి

పొట్టకూటికి ఆశపడి ఇటువంటి దౌర్జన్యకాండలకి దిగుతారనటం నిస్సందేహం.

ఆ జనసమూహంలోనుంచి నలభైయేండ్ల యువకుడు బయటకు వచ్చాడు. తలమీద టోపి, చేతిలో ఒంకెకర్ర, కాళ్ళకి బూట్లు, గ్లాస్కో పంచ, లాల్చీ ధరించాడు "ఎవరమ్మా నీవు. అతను మాకు డబ్బు యివ్వాలి. తీసుకొని అయిదు సంవత్సరాలయింది. ఎంత కాలానికీ ఇవ్వకపోతే ఏంచేస్తాం. నడిబజారులో నిలబెట్టి దగ్గరఉంటే తీసుకొంటాం" అన్నాడు.

చివరి మాటలు ఆ వచ్చిన జనం చెవుల పడేసరికి వారి ముఖ కవళికలు మారి పోయినాయ్. ప్రతి వారికీ శరీరంలోని ప్రతిరక్త బిందువులో క్రోధం, ఆవేశం ఆవరించినాయి. వారి రక్తం ఉడుకెత్తి వచ్చిన పెద్దమనిషిని పట్టుకు తన్నాలన్న భావం కలిగింది. ఎవరికి వారే ముందుకు రావాలని అడుగువేసి మరల వెనక్కి తగ్గారు. చుట్టూ వున్న జనం యొక్క ముఖ కవళికలను సుజాత జాగ్రత్తగా పరిశీలించి గ్రహించింది. ఆమెకు ధైర్యం చిక్కింది. ఆ వడ్డీ వ్యాపారస్థుని అవమానం చేయటానికి ఇదే తగిన సమయం అని తెలుసుకుంది.

"ఈ యువకుడు నీకు ఎంత డబ్బు యివ్వాలో జాగ్రత్తగా ఆలోచించి చెప్పు" అని సంచి ఊడదీసింది.

"అయిదువందల రూపాయలు" అన్నాడు.

'అయిదువందలు' అనేమాట చెవునపడేసరికి తలవంచి కూర్చున్న ఆ యువకుడు ఒక్కసారి మండిపడి లేచి "ఏమిటీ

నీకు అయిదువందలరూపాయలు యివ్వాలా? నీ దగ్గర నేను తీసుకున్నది యాభైరూపాయలే కదా?" అని లజ్జతో – సాధించిన [illegible] ప్రక్క క్రోధం స్ఫురింపచేస్తూ అన్నాడు.

"ఇంతకాలంనుంచీ వడ్డీ ఎంతయిందనుకున్నావ్?" అన్నాడు ఆ యువకుడు తలపైకెత్తి.

వడ్డీమాట వినేసరికి జనం విస్తుపోయారు. కళ్ళు అప్పగించి అతనివంక చూస్తూ నిలబడ్డారు. సుజాత ధైర్యంతో "యాభైరూపాయలకి వడ్డీతో అయిదువందలా! మీరు ఇంత దుర్వ్యాపారం చేస్తున్నారు కాబట్టే అమాయకప్రజలకి డబ్బు ఆశ చూపించి నడిబజారులో దొమ్మీ చేయిస్తున్నారు" అన్నది సుజాత.

'దొమ్మీ' అనేమాట చెవినపడేసరికి ఆ యువకుడు ఆశ్చర్యపోయి ఆమెముఖంవంక చూశాడు. మరేం మాట్లాడ లేకపోయాడు.

"ఇదిగో వందరూపాయలు. తీసికొని సంతోషపడండి" అని సంచీలోనుంచి డబ్బు తీసి అతనిచేతికిచ్చింది ఆమె.

ఆ షాహుకారు వచ్చినదానికి సంతృప్తిపడినట్లు వందరూపాయలు తీసికొన్నాడు. చుట్టూమూగిన జనం కిసకిస నవ్వనారంభించారు. ఆ అవమానం భరించలేక ఆ వడ్డీవ్యాపారస్థుడు తలవంచి తిరుగుముఖం పట్టాడు. ఈ దృశ్యాన్నంతటినీ చూస్తున్న ఆ యువకుడు అవమానం భరించలేక మూర్ఛపోయాడు. చుట్టూఉన్న జనం నీళ్ళు తీసుకువచ్చి అతనిముఖం

మీద చల్లారు. ఆ యువకుడు తేరుకున్న తరువాత ఎవరిండ్లకి వారు వెళ్ళిపోయారు. సుజాత అక్కడే నిలబడ్డది టాక్సీ తీసుకునచ్చి ఆ యువకుని మెల్లగా చెయ్యిపుచ్చుకుని ఎక్కించి ఇంటికి తీసుకువెళ్ళింది.

ఇలాంటివి సుజాతకి సామాన్యవిశేషాలుగా మారినాయి. ఈ యువకుని ప్రవృత్తి ఆమెను కలవరపెట్టింది. తన కళ్ళముందర ఒక యువకుడు చెడిపోతున్నాడే అన్న ఆవేదన ఆమెలో ప్రవేశించింది. అతనిని ఎలాగునైనా సన్మార్గమున పెట్టవలెనని దృఢనిశ్చయానికి వచ్చింది. ఆమెమీద ఎన్ని అపవాదులు ఎంతమంది పనిలేని పెంకెలు వేసినా స్వీకరించటానికి ఆమె మనస్సు ఒప్పుకుంది. ఆ యువకుడు త్రాగుబోతని, వ్యభిచారని తెలుసుకుంది. ఈ గుణములన్నీ ఆమెకు హేయాన్ని కలిగించలేదు. తల్లిదండ్రులు లేరని చెప్పిన ఆ యువకుని తన యింటిదగ్గరే ఉంచి సంరక్షణ చేస్తోంది.

*　　*　　*

## 3

అంతమంది జనసమూహంలో అవమానభరితుడై యింటికి తిరిగివచ్చాడు వడ్డీవ్యాపారియైన నారాయణ. అతని మనస్సు కలతచెందింది. 'ఒక ఆడదానిచేత అవమానింపబడ్డానే' అని అతని శరీరంలోని ప్రతిఅణువూ లజ్జపడింది. తన యింటినిండా కావలసినంత ధనం ఉన్నదే, ఇచ్చవచ్చిన పని చేయిధగల సమర్థత తనకు కలదే అన్న ధీమా, తనకు ఎదురు

తిరిగి జయించగలవారు లేరు అన్న అహం—ఈ మూడు గుణాలూ మూలమూలల దాక్కున్నాయి. ఆ యువతి పుట్టుపూర్వోత్తరాలు కనుక్కున్నాడు. తనకు దగ్గరబంధువని తేలింది. తనలాంటి వ్యక్తుల్ని, సంఘంలో ఇతరరకముల వ్యక్తుల్ని అవమానించటం ఆమెకు పరిపాటిఅయిందనికూడా తేలింది. ఆమెను ఏమిచేసి లొంగతీయ్యాలా అన్నభావం అతని మనస్సులో ప్రవేశించింది. హాలులో కుర్చీలో కూలబడి సిగరెట్టు ముక్కలు పీల్చి పడవేయసాగాడు. కాని అతనికి ఏమీ ఆలోచన తట్టలేదు. ఏమిచెయ్యాలో తోచక అటూయిటూ పచార్లు చెయ్యటం మొదలుపెట్టాడు.

భార్య కప్పులో కాఫీ పోసి తీసుకువచ్చింది. భర్త ముఖం చూచేసరికి ఆమెకు అనుమానం కలిగింది. "అతనిలో ఎందుకు ఈ మార్పు కలిగింది?" అన్న ప్రశ్న ఆమెను మధనపెట్టింది. దానికి సమాధానము తన భర్తద్వారానే రావాలని నిశ్చయించుకుంది.

"ఇదిగోండి; కాఫీ తీసుకువచ్చా" అని కప్పు చేతికి అందివ్వబోయింది.

"అక్కడ కుర్చీమీద పెట్టు. నేను తీసుకుంటానులే" అన్నాడు చిరాకుతో భర్త.

ఆమె తిరిగి ప్రశ్నించకుండా కాఫీ కప్పు బల్లమీద పెట్టి అక్కడే నిలబడ్డది. అయిదునిముషాలు చూచి తీసుకోనక పోయేసరికి మరల ఒకసారి జ్ఞప్తి చెయ్యాలని "కాఫీ అక్కడపెట్టానండీ, చల్లారిపోతుంది" అని చెప్పింది.

కాఫీ త్రాగి కప్పు బల్లమీద పెట్టి మరల పచార్లు చేయటం మొదలుపెట్టాడు నారాయణగారు. ఈ సారి ఆమె మనస్సు ఊరుకోనలేకపోయింది. భర్త మనస్సులోని ఆవేదన తెలుసుకోవాలన్న ఆసక్తి ఆమెలో ఎక్కువైంది. పెదిమెల చివరవరకు వచ్చి బిగబట్టుకుంది. కాని ఊరుకోనలేకపోయింది.

"ఏం జరిగిందండీ...అంత ఆవేశంగా ఉన్నారు" అని సౌమ్యంగా ప్రశ్నించింది. సమాధానం చెప్పటానికి సిగ్గుపడి వినపడనట్టుగ నటించాడు నారాయణ.

ఆమె ఊరుకోనలేకపోయింది. తిరిగి గట్టిగా అడిగింది. ఈ సారి తప్పించుకోటానికి వీలులేకపోయింది. కొంచెం పేస్పు పడబడి "ఏం జరగటమేమిటి? నిన్న నట్టనడిబజారులో అవమానం జరిగింది. ఈ స్త్రీజాతి దగ్గర ఉన్న దుర్గుణమే అది! ఎప్పుడు ఏ సమయంలో ఎలా ప్రవర్తించాలో తెలియదు."

స్త్రీజాతిని విమర్శించేసరికి ఆమెలో అభిమానానికి స్థానం కలిగింది. మరుక్షణంలోనే భర్తకి అవమానం జరిగిందని అనే విషయం అభిమానాన్ని అణచివేసింది.

"ఏం జరిగిందండీ నాతో చెప్పకూడదా" అని తిరిగి ప్రశ్నించింది.

"ఎవరో సుజాతట...నీటుగా బట్టలు వేసుకొని నాచేత చెప్పు తొడిగించుకున్నవలసిన మోహాన్ని మన నౌకర్ల చేత అడిగిస్తే 'నాకు స్మగ్లచేసి ఎంతమంది కొంపలు ముంచుతారు. ఇదిగో మీ చెప్పు' అని వందరూపాయలనోటు ముఖాన విసరింది. చుట్టూ

ఉన్న జనం పకపక నవ్వారు. ఇంతకన్నా అవమానం ఏం కావాలి?" అని అభిమానంతో సమాధాన మిచ్చాడు నారాయణ.

'సుజాత' పేరు ఆమెచెవినిపడేసరికి నిశ్చేష్టురాలైంది. సుజాత ఆమెకు దగ్గిరచుట్టం. కాని వారికీ వీరికీ రాకపోకలు లేవు. అందువలన నారాయణగారికి సుజాత తన బంధువని తెలియదు. వాళ్ళ స్వగ్రామంలో సుజాతని అందరూ గౌరవి స్తారు. ఆమె బజారువెంట నడుస్తుంటే పేదప్రజలందరూ ఆమెకు దణ్ణాలు పెడ్తారు. సుజాత తన బంధువని చెప్పితే ఆమెనిగూడ నిరుచుకుపడ్తాడని ఆ సంగతి భర్తకు తెలియనీయలేదు. నారా యణగారు సుజాత తనభార్యవైపుచుట్టం అని చూచాయగా తెలుసుకున్నాడు. ఆమె ఆ ప్రసక్తి తప్పించి మరొక ప్రసక్తి తెచ్చింది.

"అయితే చూసారా. మన గోపీ రెండో పెళ్ళి చేసు కుంటాడుట. తన కిష్టంలేని పెళ్లిచేసారని, భార్యకు గర్భకోశంలో సుస్తీ అని, తను దాంపత్యం చేయకూడదని డాక్టరు సలహా యిచ్చారుట" అని భర్త చెవున పడవేసింది.

ఈ మాటలు నారాయణగారి చెవినిపడేసరికి ఉగ్ర రూపం దాల్చాడు. ఆయనకు ఏమి మాట్లాడాలో తెలియ లేదు. మరుక్షణంలోనే అతని మనస్సు లజ్జపడింది. బ్రహ్మయ్య గారికొడుకు మారుపెళ్ళిచేసుకున్నాడని ఎగతాళిచేసాడు. ఇప్పుడీ ఊరిలో తలెత్తుకు తిరగటం ఎట్లా అని అతని మనస్సు లజ్జ

పడింది. కోడలు సుస్త్రీ మనిషని అతనికి తెలుసు. మొదటిసారి కాన్పుకి ఆమెకు చాలా సుస్తీచేసి ఆపరేషన్ చేయవలసిన పరిస్థితి వచ్చింది. అప్పుడే డాక్టరు ఇక భార్యాభర్తలు కలవకూడదని సలహాయిచ్చారు. నారాయణగారు సందిగ్ధావస్థలో పడ్డాడు. ఈ ప్రశ్న అతని మనస్సుని కలతచెందించింది.

"ఈ సమస్యల్ని పరిష్కరించటానికి ఎవరన్నా ప్లీడరు గారికి తే బాగుండు" అనుకున్నది ఆయన మనస్సు. పైన ఉన్న దేముడు ఒక్కడే ఆ సమస్యల్ని పరిష్కరించగలడని అతని మనస్సు సమాధానపరచుకొన్నది. తను చేసే వడ్డీవ్యాపారానికి దేముడు గుర్తుకు రాడు. ఎన్ని అన్యాయాలు చేస్తున్నా నాస్తికవాదిలాగ ప్రవర్తించేవాడు. కాని ఇలాటి సమస్యలు వచ్చేసరికి 'ఆస్తిక'వాదిగా మారేవాడు నారాయణగారు.

"ఏడీ అబ్బాయి, యింట్లో ఉన్నాడా" అని ప్రశ్నించాడు భార్యను.

"ఊళ్ళో లేడండీ ప్రొద్దున పట్నం వెళ్ళాడు."

'తనతో చెప్పకుండా పట్నం వెళ్లిన వ్యక్తి సలహా వింటాడా?' అన్న ప్రశ్న అతనిలో ప్రవేశించింది. ఏమి సమాధానం చెప్పకోవాలో ఆలోచిస్తూ పచార్లు చేయటం మొదలు పెట్టాడు.

కాఫీ కప్పులు తీసుకొని నారాయణగారిభార్య లోపలికి వెళ్లింది.

వడ్డీవ్యాపారి నారాయణగారు హాలులో పచార్లు

చేస్తూ సిగరెట్టు ముక్కలతో హాలు అంతా నింపాడు. ఏమీ ఆలోచన తట్టలేదు. మనిషికి అభిమానం మెండు.

పంచె, లాల్చీ ధరించి, తలపాగ చుట్టి, ముఖాన ముచ్చటగ పంగనామాలుపెట్టి, నోట్లోనుంచి గుప్పున చుట్టపొగ వదులుతూ, కాళ్ళచెప్పులు చప్పుడు చేసుకుంటూ హాలులోనికి ప్రవేశించాడు— నారాయణగారి సలహాదారు, అంతరంగిక వ్యవహారాలలో జోక్యం కలగజేసుకొనే వ్యక్తి రామయ్య. కాళ్ళచెప్పులు చప్పుడు విని పచార్లుచేస్తున్న నారాయణగారు ఉలిక్కిపడి తిరిగిచూచాడు. నిండైన విగ్రహంతో రామయ్య కంటబడ్డాడు. "రా! రామయ్యా" అని కుర్చీ లాగాడు.

"ఊరిలో విశేషాలు ఏమిటి" అని ఏమీ తెలియని వానిలాగ ప్రశ్నించాడు నారాయణగారు.

"ఏమి ఉన్నాయండీ! నిన్న మీరు టౌనుకి వెళ్ళినప్పుడు అక్కడ ఏదో గలభా జరిగిందని ఊరంతా చెప్పుకుంటున్నారు" అన్నాడు రామయ్య.

నారాయణగారి ముఖం వాడిపోయింది. మరల తలెత్తి తిరిగి సమాధానం చెప్పలేకపోయాడు.

"ఇంకా ఏమి చెప్పుకుంటున్నారు" అని ప్రశ్నించాడు.

"ఎవరో ఆడది మీ మీదికి చెప్పెత్తిందిట. మీరు మాట్లాడకుండా ఇచ్చిన డబ్బు పుచ్చుకొనివచ్చారుట" అని ముగించబోయాడు రామయ్య.

"చాలులే...ఇంకా చెప్పనక్కరలేదు. అయినా రామయ్యా? ఈ పల్లెటూరిలో ఉంటే ఇదే గొడవ. గోరంత ఉంటే కొండంత చేస్తారు" అన్నాడు నారాయణగారు.

"టౌనులో గొడవ మీరు అనుభవించారుగా. ఆడాళ్ళ చేత దెబ్బలు తింటమెందుకు? టౌనుకి వెళ్ళట మెందుకు?"

"లేదు రామయ్యా...దెబ్బలు ఎవరు తిన్నారు? నాకు రావలసిన డబ్బు అడిగాను. ఆ అమ్మాయి ఎవరో, వాడికి ఏమవుతుందో సంచిలోనుంచి తీసియిచ్చింది" అన్నాడు.

"నారాయణగారూ! ఎందుకు వచ్చిన వడ్డీవ్యాపారం చెప్పండి. ఇచ్చేటప్పుడు దర్జాగా యిస్తారు. ఇచ్చినదగ్గరనుంచి వాళ్ళ కాళ్ళు, గడ్డాలు పుచ్చుకోను, లేకపోతే దూకుడుగ దౌర్జన్యం చేస్తే ఆడవాళ్ళు—" అని పూర్తిచేయబోయాడు రామయ్య.

"చాలుగాని ముందుకర్తవ్యం ఏమిటో చూడు. అబ్బాయి గోపీ భార్యకి గర్భకోశంలో జబ్బు అని రెండో పెళ్ళి చేసుకుంటాడుట. అంతకన్నా అవమానం" అని సగంలోనే ఆపేశాడు నారాయణగారు.

"మన ఊరికి ఎవరో సన్యాసివచ్చాడుట, ఆయనచేత బడి, భూతవైద్యం, ఇంకా జబ్బులు నయంచేస్తాడుట. ఆ జనం అంతా పోతున్నారు."

"ఇంకా ఇప్పుడు చేతబడులమీద ఎవరికి నమ్మకం ఉంది రామయ్యా. ఏదో మనసిచ్చిగాని, పల్లెటూళ్ళో ఉండటం చేత మనలను మోసగించటానికి దొంగసన్యాసులువస్తున్నారు."

"లేదండీ ఈ సన్యాసి గొప్పవాడుట. విచిత్రమైన పనులు చేస్తున్నాడుట, ఇసుకని పంచదార చేస్తున్నాడుట."

రామయ్య అంటే నారాయణగారికి నమ్మకం. అతను ఏమి చేయమంటే ఆ పనికి సిద్ధమౌతాడు. రామయ్య సలహా అంగీకరించుదామని నిశ్చయించుకొన్నాడు.

"సరే! రామయ్యా! నీవు వెళ్లి ఆయనను మనింటికి తీసుకురా!" అన్నాడు.

"అట్లాగే బాబూ వెళ్లి వస్తా" అని రామయ్య బయటికి వెళ్ళాడు.

* * *

## 4

"సుజాతా! నా దగ్గర ఏమున్నదని డబ్బు యిచ్చి విడిపించావ్?"

మోహన్ మాటలు ఆమెకు ఆశ్చర్యం కలిగించినాయి. "నీ దీనపరిస్థితిని చూసి విడిపించా" అంది.

మోహన్ తలవంచేసాడు. ఎందుకు ప్రశ్నించానా అని మనస్సులో బాధపడ్డాడు. 'గతం నాస్తి'. అయిపోయినదానికి విచారిస్తే ఏం లాభం అనుకున్నాడు మనస్సులో.

"నీకు భూతవైద్యంమీద నమ్మకం ఉన్నదా" అని ప్రశ్నించాడు మోహన్.

"ఏం? దేనికి? ఏం జరిగింది?" అని తిరిగి ప్రశ్నించింది సుజాత.

"ఊరుకి ప్రక్కనే చిన్నపల్లెటూరికి ఎవరో సన్యాసి వచ్చాడుట. భూతవైద్యం చేస్తాడుట. మంత్రాలు నేర్పుతాడుట."

"మంత్రాలు నేర్చుకొని ఎవరిమీద ప్రయోగిద్దామని? అయినా మంత్రాలకి చింతకాయలు రాల్తాయా?" అన్నది.

మోహన్ ముఖం చిన్నబుచ్చుకున్నాడు. ఎంతో ఆశాజనకమైన సమాధానం వస్తుందని ఆశించాడు.

"లేదు సుజాతా! రేపు నేను ఆ పల్లెకు వెళ్ళివస్తా" అన్నాడు మోహన్.

"సరే, నీ యిష్టం. వెళ్ళిరా" అన్నది సుజాత నవ్వుతూ.

మోహన్ కాళ్ళకి చెప్పులు వేసుకొని సైకిలు ఎక్కాడు. సుజాత మోహన్‌ని గుమ్మందాకా పంపించి తిరిగి లోపలికి వచ్చి కుర్చీలో కూర్చున్నది.

మోహన్ సైకిలు ఎక్కి బయలుదేరాడు. అతని ఉద్దేశ్యం ఊరుప్రక్కనే ఉన్న సన్యాసిదగ్గరకు వెళ్ళి రావాలని. కాని అతని సైకిలు అలవాటైన సందుగొందులు తప్పించి ఊరు దాటటం సాధ్యంకాకపోయింది.

ఎల్లవేళలా వేశ్యావృత్తి నవలంబించే గృహములకు పట్టణములలో కొదవేమున్నది. ప్రతి దినమూ ఎంతమంది మోహన్‌లాంటి యువకుల్ని తమ యౌవనసౌందర్యంతో ఆనందపెట్టి ఇంటికి పంపించటంలేదు. దయాదాక్షిణ్యములు లేకుండా నిర్దాక్షిణ్యంగా ఎంతమంది సంసారాల్ని నాశనం

చేయటంలేదు. వారికి కావలసినది పొట్టకి కూడు, ఉండటానికి యిల్లు. చేతికి డబ్బు యిచ్చిన కొలదిరోజులూ వారు అనుభవించు ఆనందం శాశ్వతానందంగా తలుస్తారు. వారిలాంటి యువతుల్ని, జ్ఞానవిహీనుల్ని సన్మార్గానికి త్రిప్పటానికి ఎందుకు పాటుపడకూడదూ అని సుజాత ఆలోచనాసముద్రంలో మునిగి పోయేది. వారిలో వేశ్యావృత్తి నవలంబించి ఎంతమంది పొట్ట కూటికి పాటుపడుతున్నారు ?

తరతరాలనుండి వచ్చే భారతస్త్రీ సాంప్రదాయాన్ని మట్టి కలుపుతున్నారే. భారతజాతి గౌరవప్రతిష్టలకు వీరు ఆటంకమగుచున్నారే! వీరిలాంటివారిని సంఘం ఇంకా ఎందుకు గౌరవించాలి. సంఘంలో సంచరించే యువకులు క్షణిక సౌంద ర్యానికి ఎందుకు మోసపోతున్నారు ? కేవలము వారు జ్ఞాన హీనులు కాదే ! విజ్ఞానవేత్తలు, చదువుకున్నవారు అనేక వేల మంది వ్యసనమునకు లోనగుచున్నారే ? సంఘ అభివృద్ధికి పాటుపడుతున్నామని చెప్పుకుంటూ, సంఘబలహీనతకు దారి తీస్తున్నారే. సంఘంలో స్త్రీ పురుష సమానత్వంకొరకు పాటు పడేవారమని గొప్పలు చెప్పుకుంటూ, స్వవిషయము వచ్చే సరికి స్త్రీకి రాణించుటకు అవకాశ మిచ్చుట లేదే! తోటి స్త్రీ ఆఫీసులో పనిచేస్తుంటే ఆమెను విచిత్రజంతువులాగా చూస్తుం టారే !

స్త్రీ అంటే వంటవండే వంటలక్క గాక దేశసౌభా గ్యముకొరకు పాటుబడే వీరవనిత అని వీరు గుణపాఠం నేర్చు కోలేదే ! ఇంకా స్త్రీ జాతి అభివృద్ధిని ఆటంకపరచే కారకుల్ని

కాలజూచాలి" ఈ విధమైన విప్లవభావాలతో సుజాత మనస్సు నిండిఉండేది. పూర్వాచారపరాయణులైన ఆమె తల్లిదండ్రులు ఆమె మనస్తత్వాన్ని పూర్తిగా గ్రహించలేకపోయారు. ఇక మోహన్‌లాంటి యువకులు ఆమె మనస్తత్వాన్ని తెలుసుకోగలగటం దుర్లభం.

మోహన్ సైకిలు మూరుమూలనున్న పెంకుటింటిదగ్గర ఆపాడు. ఎవరికోరకో నిరీక్షిస్తున్నవారిలాగ ఆ వీధిలోని ప్రతి గుమ్మందగ్గర యువతులు నిలబడి బైటికి తొంగి తొంగి చూస్తున్నారు.

వారి జడలతీరు, చీరెలజోరు, ముఖములసొగసు, సెంటు నూనెల సువాసన ఆఘ్రాణిస్తూ బజారువెంబడి నడిచే ప్రతి యువకుడూ వారివంక దృష్టిమరల్చుతూ, జ్ఞానులైన వారు వారి పనిమీద వారు వెళ్ళుతూ, మిగతవారు ప్రక్కలకు నడక సాగిస్తున్నారు. వారికి కావలసింది ధనము. వచ్చిన యువకుని ఆనందపెట్టి, ఇచ్చగించి ధనం కైంకరించి ఇంటికి పంపించటం. ఇది వారి నిత్యజీవిత చర్యలో ఒకభాగము. సాయంత్రపువేళ అగుసరికి ఆ వీధికి కలిగే వెలుగు, యువతుల ముఖములనుండి వెదజల్లబడే కాంతి, వీధివెంబడి నడిచే భావకవులకి గేయ రూపంలో సాక్షాత్కరిస్తాయి, వేదాంతులకు హేయభావము కలిగిస్తాయి; ఏ భావము తీసుకున్నవారికి ఆ భావం స్ఫురింపజేస్తాయి.

మోహన్ సైకిలు గుమ్మందగ్గర నిలబెట్టాడు. బయటకు

తొంగితొంగిచూస్తున్న ఆ యువతిముఖం వికసించింది. ఆమె తలుపులు రెండూతీసి గబగబా లోపలికి వెళ్ళి కుర్చీ సర్దింది.

"రండి బావగారూ! మీ కొరకు చాలసేపటినుంచి ఎదురుచూస్తున్నా" అన్నది మోహిని.

ఆమె పెదవులమీదనుండి బయటకు వెదజల్లబడిన ఎర్రని కాంతికి మోహన్ కళ్ళు జిగేలుమన్నాయి. మోహన్ నిమాత్రమూ కదలలేదు.

"అదేమిటీ అట్లా చూస్తూ కూర్చున్నారు...మీరు వచ్చింది" అని పూర్తిచేయబోయింది మోహిని. సరాసరి వచ్చి మోహన్ కూర్చున్న కుర్చీలోనే అతని ఒడిలో కూర్చున్నది. "మీరు వచ్చింది" అనే మాట చెవులపడేసరికి మోహన్ ఒడలు జలదరించినట్లయింది. కుర్చీలో అటూయిటూ కదిలాడు.

"నేను వచ్చింది..." అని మాట పూర్తిచేయకుండానే ఆమె మెడచుట్టూ రెండుచేతులూ వేసి, ఆమె చెక్కిలిమీద ముద్దుపెట్టుకున్నాడు.

మోహన్ ముద్దుపెట్టుకున్నాడన్న విషయం ఆమెకు సామాన్యవిషయం. "ఎంతనుండిని చూసాను" అన్నట్లుగా మోహిని అతనివంక చూసింది.

ఆమె చేతలలో ప్రస్ఫుటమయ్యే భావము "ఆమె ఇంకా కోరుతున్నదా" అన్నట్లుగా భావించాడు మోహన్.

"ఇదిగో, మోహినీ! నేను మోహన్‌ని కదూ! ఏదీ

ఇంకొకసారి"...అని ఆమెను మరల రెండుచెక్కిళ్ళమీదా ముద్దుపెట్టుకున్నాడు.

చెదిరిపోయిన పైటచెంగు సర్దుకుంటూ "బావగారు ఏమీ హుషారుగా లేరు...చలాకీ లేందే?" అంటూ ఆమె మోహన్ ఒడిలోనుంచి లోపలికి వెళ్ళింది.

"ఎందుకు లోపలికి వెళ్ళిందా?" అన్నట్లు ఆలోచిస్తూ కుర్చీలో కూర్చున్నాడు మోహన్.

పరదా బయటకు తొలగించి, చేతిలో ఔన్సుగ్లాసు పుచ్చుకొని కులుకుతూ, వయ్యారంగా వచ్చింది మోహిని. ఆమె నడకలోని వయ్యారం, ముఖసౌందర్యం చూచిన మోహన్‌కి ఆమె చేతిలోని గ్లాసుపై దృష్టి బడలేదు.

"ఇదిగో ఇది రుచి చూడండి...అప్పుడుగాని మనిద్దరికీ" అని అతని నోటిదగ్గరకు చేయిపోనిచ్చింది మోహిని.

ఆ గ్లాసువైపు చూచేసరికి మోహన్‌కి ఒళ్ళు జలదరించి నట్లయింది. మనస్సులో ఏదో తెలియని భయం పెనవేసు కుంది.

"వద్దు మోహినీ" అన్నట్లుగా మాట చెప్పలేక అతని నేత్రాలతో వ్యతిరేకభావం స్ఫురింపజేసాడు. ఆమె అతని నేత్రాం లని చూసి ఆశ్చర్యపోయి "బావగారూ! నామాట వినరూ... తప్పకుండా వింటారుగా" అని ఆమెచేతులు రెండూ మోహన్ మెడకి చుట్టి, అతనిని పెనవేసుకుంది. ఆమె అవయవాల తాకి డికి మోహన్ ఉలిక్కిపడి ప్రక్కకు కదలబోయాడు. ఆమె

బాహువుల సంకెళ్ళనుండి బయటకు రాలేకపోయాడు. తప్పని సరి అయి "సరేలే మోహినీ" అన్నాడు.

ఆ మాటలు విని మోహిని ఆనందంతో "మా బావ గారు మంచివారు" అని మోహన్ చెక్కిలిమీద ముద్దుపెట్టు కున్నది.

మోహన్ ఆమె హస్తాలలోనుంచి ఔన్సు గ్లాసు తీసికొని మందు గుటకలు వేసాడు. పదినిమిషాలవ్యవధికి అతనికి నిషా ఎక్కింది. ఈ ప్రపంచాన్ని వదలిపెట్టి మరోప్రపంచానికి వెళ్ళాడు,

"ఏది మోహినీ... మోహినీ...ఇంకా కొంచెం" అని కుర్చీలోనుంచి లేచాడు.

మోహిని మోహన్ పరిస్థితి గ్రహించింది.

"ఇంక ఎక్కువ త్రాగకూడదు, ఆరోగ్యం చెడిపోతుంది బావగారూ" అని ప్రక్కకు జరిగింది,

"ఫరవాలేదులే మోహినీ. నాకు తెలుసుగా దాని మజా, నీ మజా..." అని ఆమెను తన రెండుచేతులతో గట్టిగా చుట్టివేసి తన హృదయానికి అదుముకున్నాడు. మోహినిదగ్గర బల్లమీద ఉన్న సీసాలోని పానీయం పోసింది. మోహన్ రెండుగుటకలలో మ్రింగివేసాడు. ఈ సారి నిషా మరీ ఎక్కువైంది. మనస్సు పట్టు తప్పిపోయింది.

"మోహినీ...మోహినీ..." అంటూ తల నామెభుజంమీద వాల్చాడు. మోహిని మెల్లిగా రెండుచేతులతో మోహన్ ని

గట్టిగా పట్టుకొని, మెల్లిగా లోపలికి తీసుకువెళ్ళి, ప్రక్క మీద పరుండబెట్టి, తనూ ప్రక్కనే ఒత్తిగిలి చేతులు రెండూ మోహన్ జేబులలోనికి పోనిచ్చింది.

* * *

## 5

నాగార్జునగారింట్లో జనసమూహం అంతా క్రిక్కిరిసి పోయింది. వచ్చేజనం పోయేజనం. వచ్చినజనసమూహం అంతా చూడటానికి వికృతవేషధారులై ఉన్నారు. విరబోసుకున్న జుట్టు, ముఖమున పెద్దకుంకుమబొట్టు, తడిసిన బట్టలు, ఒళ్ళు తెలియని పరిస్థితిలో వారు వేసే కేకలతో దాబాదద్దరిల్లింది.

హాలుమధ్యలోనే వచ్చిన భూతవైద్యుడు పీట వేసుకొని స్థానం స్వీకరించారు. అతి భీకర ఆకారాన్ని చూసి, కొంత మంది పిల్లలు, పెద్దలు, వింత చూద్దామని వచ్చినవాళ్ళంతా తిరుగుముఖం పట్టారు.

నిమ్మకాయ నోటిలో పెట్టుకొని, జుట్టు విరబోసుకొని, నుదుట పెద్దకుంకుమబొట్టు పెట్టుకొని పీటమీదనుంచి పైకిలేస్తూ "ఓం...భూం...ఘూం" అంటూ కేకలు వేయసాగాడు. ఆ కేకలతో వచ్చిన జనసమూహం అంతా దడిసిపోయారు. కాని వచ్చిన భూతవైద్యుడు ప్రేక్షకులవైపు ఏమాత్రం దృష్టి మరల్చలేదు. అతని దారిన అతనే కేకలు వేయసాగాడు. ప్రక్కనే స్థంభానికి బలిజంతువును కట్టివేశారు.

ఆ మేకపోతు దీనావస్థ వచ్చిన ప్రేక్షకులలో ఎవరినీ ఆకర్షించలేదు. "నా కేసి చూడండి, నా పరిస్థితి ఆలకించండి" అన్నట్లుగా ఆ మేకపోతు తల ఆడిస్తూ అందరివైపు అతి దీనంగా చూడనారంభించింది. కాని ఆ మెచూపులు ఎవరినీ ఆకర్షించలేదు.

వచ్చిన భూతవైద్యుడు ఎదురుగుండా ఉన్న అగ్ని గుండంలో సాంబ్రాణి పొగ వేసాడు. ఆ పొగ గప్పున లేచి హాలు చుట్టూ ఆవరించింది. అదే సమయంలో భూతవైద్యుడు "ఓం...ఘూం...హాం... ఏం కావాలి, ఇస్తున్నా బలి... ఇదిగో" అని ప్రక్కనే వున్న మేకపోతును తీసుకువచ్చి కత్తి పైకెత్తాడు.

ప్రక్కనే అగ్నిగుండం చుట్టూ ఒకప్రక్కన నారాయణ గారు, భార్య, మరొకప్రక్కన నారాయణగారి కోడలు, వారి బంధువులు కూర్చొని ఉన్నారు. మరల ఏవో వచ్చి రాని మంత్రాలు ఉచ్ఛరించి కత్తితో ఒకే వేటుతో ఆ మేక పోతు తల తెగకొట్టాడు. తల వెళ్ళి అగ్నిగుండంలో పడింది.

తరువాత కొంచెంసేపటికి ఎవరిండ్లకు వారు వెళ్ళారు.

కారు వచ్చి గుమ్మందగ్గిర ఆగింది. కారులోనుంచి సూటు, టోపి పెట్టుకొని, చేతిలో సంచీ పుచ్చుకొని లోపలికి ప్రవేశించాడు గోపి. నారాయణగారి కోడలు భర్తరాక చూసి మురిసిపోయి గబగబా లోపలినుంచి కడుక్కోటానికి చెంబుతో నీరు తెచ్చింది.

"అక్కడ పెట్టు, నే తీసుకుంటాలే" అని ఎక్కడలేని చిరాకు తెచ్చుకొని మాట్లాడాడు గోపి.

ఎంతో ఆప్యాయతతో భర్తకొరకు నీరు తెచ్చిన ఆమె, ఆయన చిరాకు సమాధానానికి మనస్సు 'చివుక్' అన్నది. ఆమెలో ఎక్కడలేని నిరాశ వ్యాపించింది, ఆమె మట్టుకు ఏమి చేయగలదు. "లోకంలో స్త్రీ భర్తకి ఎదురు తిరిగి సమాధానం చెప్పితే ఆమెను ప్రక్కకు త్రోసివేస్తారే! భర్త ఏ మాదిరిగ ప్రవర్తించినా భార్య అణిమణిగి ఉండవలసినదేనే! తను భర్త వలన ఏ నాడూ సుఖపడలేదు. అతనిని తను సంతోషపెట్టలేదు" అనేబాధ ఆమె మనస్సును కదల్చింది. భగవత్ ప్రేరణము వలన ఆమెకు కలిగిన జబ్బుకు మానవమాత్రురాలగు ఆమె ఏమి చేయగలదు. "గర్భాశయరోగము" అని డాక్టరు సలహా యిచ్చిన తరువాత ఆమె భర్తని సుఖపెట్టలేదు. భర్త తనతో 'మాటా మంచీ' అయినా లేదే అన్న బాధ ఆమెకు కలిగింది. భర్తకు సేవచేయటం ఆమె ధర్మమని మటుకు గ్రహించగలిగింది. నిత్యము అతనికి సేవచేస్తూనే ఉన్నది. గోపికూడ మనస్సులో అప్పుడప్పుడు బాధపడేవాడు. పెండ్లి చేసుకున్న తరువాత భార్య పనికిరానిదైనా ఆమెమీద ప్రేమ ఉండటం భర్తకి సహజమేగా! భార్య జబ్బుకొరకు ఎంతమందికో డాక్టర్లకు చూపించాడు. కాని డాక్టర్లు ఏమాత్రము అతనికి సంతోషము కలిగించలేదు. ప్రతివారు నిరాశాపూరితమైన సలహాలనిచ్చారు.

"భర్తకి ఆనందం కలిగించలేనిభార్య ఎందుకు జీవించటం" అని ఆమెమనస్సు ప్రశ్నించుకొనేది. తన భర్త రెండవపెళ్ళి చేసుకుంటే తనని హేయంగా చూస్తాడని, మత

వారిద్దరికి సేవచేస్తూ కాలం వెళ్ళబుచ్చవలసివస్తుందని మనస్సు బాధపడేది.

"ఇదిగో విజయా...నన్ను ఈ మాదిరిగ బాధపెట్టడం సంతోషమా!" అన్నాడు గోపి.

ఈ మాటలు ఆమె చెవునపడేసరికి ఎక్కడలేని దుఃఖం పెల్లుబుకుకొచ్చింది. కళ్ళవెంబడి నీరు ధారగా ప్రవహించినాయి. ఏమి సమాధానము చెప్పాలో ఆమె ఊహించలేకపోయింది.

"నేను మిమ్మల్ని ఏం బాధపెట్టాను" అని భయంతో వణుకుతూ ఎదురుప్రశ్న వేసింది.

"ఏం బాధపెట్టావా! ఎంతకాలమని నేను సహించి ఊరుకోను. ఇక మనిద్దరి దాంపత్యము సాగదని డాక్టర్లు సలహాల నిచ్చారు. దాంపత్యముచేస్తే మనిద్దరి జీవితాలు నాశనమవుతాయి. నీ జీవితమేకాకుండా నా జీవితముకూడ నాశనం చేయటం నీకు ఆనందమా...సంతోషమా..." అని ఉద్రేకపూరితుడై ప్రశ్నలవర్షం కురిపించాడు గోపి.

ఆ ప్రశ్నల వర్షానికి ఆమె తట్టుకోనలేకపోయింది. ప్రాణం గిలగిల తన్నుకున్నది. ఏమి సమాధానము చెప్పాలో తట్టక అయోమయపరిస్థితిలో పడ్డది. వెంటనే తెప్పరిల్లి ధైర్యం తెచ్చుకొని:

"మీ జీవితం నాశనం చేయాలని నాకు ఎన్నడూ లేదు. ఒక్కమాట ఆలోచించండి, నాకు రోగమా నేను తెచ్చుకున్నది గాదు. భగవంతుడు యిచ్చినదానికి ఒకరు ఏమి

చేయగలరు. పెండ్లి చేసుకున్న తరువాత భార్య కష్టాలకి భారం వహించాల్సింది భర్తగాని, కన్నతల్లితండ్రులు కాదుగా?"

గోపి గుటకలు మ్రింగాడు. భార్యకి ఏమి సమాధానము చెప్పాలో ఆలోచించవలసి వచ్చింది.

"ఎలాగో నీవు నా వలన సుఖపడేది లేదు, నేను నీ వలన సుఖపడేది లేదు. నేను రెండవ వివాహము చేసుకుందామని నిశ్చయించుకున్నా" అన్నాడు గోపి.

ఆమె ఒడలు జలదరించింది. భర్త స్థిరనిశ్చయానికి వచ్చాడని విజయ గ్రహించింది.

"రెండవ వివాహమా! నా గొంతుక కోసినట్లుగానే ఆమెగొంతుకకూడ కోయటానికా! ఆమెకు ఏదన్నా జబ్బు చేస్తే తృతీయవివాహమా!"

'తృతీయ' అనేమాట చెవునపడేసరికి గోపి మనస్సుకు నొప్పి కలిగింది.

"ఆగు...ఇక చాలులే నీ సలహా..." అని కోపంతో అన్నాడు.

"ఉన్నమాట అంటే కోపం దేనికీ...నాకు జబ్బులని ద్వితీయవివాహం చేసుకుంటున్నారు. రోగాలు భగవత్ సృష్టి గదా ఆమెకు సుస్తీచేస్తే తృతీయం తప్పదుగదా? అయినా మీరు పెళ్ళిచేసుకుంటే మీ యిద్దరికి నేను 'దాసి'ని గాను" అని కళ్ళవెంటడి నీళ్ళు తుడుచుకున్నది.

"నీవు మీ వాళ్ళయింటికి వెళ్ళు. చదువుకున్నదానివే

గదా! తరువాతి సంగతి ఆలోచించుకో" అని కుర్చీలోనుంచి లేచి వెళ్ళిపోయాడు.

"చదువు ఇందుకు ఉపయోగపడిందా" అని మనస్సులో విచారపడి అక్కడనుండి ఇంట్లోకి వెళ్ళిపోయింది.

హాలులో తండ్రికొడుకు లిద్దరూ కుర్చీలలో కూర్చున్నారు.

"నాన్నగారూ, ఇంటినిండా ఈ కసాంబ్రాణిధూమ కారణం ఏమిటి"

"నీ భార్య సుస్త్రీ నయమవటానికి భూతవైద్యం చేయించా."

"భూతవైద్యం చేయించారా? మీకు ఈ విషయం ఎవరు చెప్పారు నాన్నగారూ?"

"ఎవరేమిటి, మన రామయ్య. సన్యాసి ఊరిలోకి వచ్చాడని మనింటికి తీసుకువచ్చాడు."

"తీసుకువచ్చి."

"ఆ సన్యాసి, మీ కోడలికి సుస్త్రీ నేను నయంచేస్తాను. ఆమెను ఒకగ్రహం పట్టుకు పీడిస్తోంది. ఆమెకు గర్భరోగము అని చెప్పాడు."

"ఈ విషయం అతను అంతట అతనే చెప్పాడా?" అని ఆశ్చర్యంగా అడిగాడు గోపి.

"అవును."

"వైద్యం చేస్తానన్నాడా" అని భార్యకి జబ్బు నయమవుతుందేమో అన్న ఆశతో ప్రశ్నించాడు.

కొడుకు మాటలలో దాగిఉన్న భావాన్ని గ్రహించి కంట తడిపెట్టుకున్నాడు నారాయణగారు.

"అయిదువందల రూపాయలు తీసికొని వయం చేస్తే పని ఏవో మంత్రాలు చదివాడు. ఏమీ లాభం లేకపోయింది."

ఈ సమాధానంతో గోపి ముఖం వాడిపోయింది. లోపలనుండి తల్లి రెండుకప్పులలో కాఫీ తీసుకొచ్చింది.

"నాన్నగారూ, నేను రెండవపెళ్ళి చేసుకుంటున్నాను. సంబంధముకూడ నిశ్చయమైంది" అని తండ్రికేసి తిరిగాడు గోపి.

నారాయణగారు, భార్య యిద్దరూ ఆశ్చర్యచకితులై అతని ముఖంవంక తేరిపార చూసారు.

ఈ దృశ్యాన్నంతటిని చూస్తున్న నారాయణగారి కోడలు కొయ్యబారినట్లయి గోడకు ఆనుకుని నుంచుండి పోయింది. రెండునిముషముల సేపు అంతా మౌనంగా నిల బడ్డారు. ఈ రెండునిముషముల సమయంలో తండ్రిదగ్గరనుంచి ఏమి సమాధానం వస్తుందా అని ఆతృతతో వారిద్దరి వంక చూస్తూ కూర్చున్నాడు గోపి.

"అదేమిటిరా, రెండవపెళ్ళా... మొదటిభార్యఉండగా" అని పూర్తిచేయబోయాడు నారాయణగారు.

తండ్రి సమాధానం విని గోపి ఉగ్రరూపం దాల్చాడు. ముఖం కందిపోయింది. కళ్ళు రెండూ ఎర్రబడినాయి.

"అవును నాన్నగారు. రెండవపెళ్ళి...ఆమెకు యిష్ట మయింది" అని కోపంతో అన్నాడు గోపి.

ఈ మాటలు లోపలనుంచి వింటున్న గోపి భార్యక్రింద పడిపోయింది. నారాయణగారి భార్య కాఫీ కప్పులు అక్కడపెట్టి లోపలికి వెళ్ళింది.

"అవును నాన్నగారు...ఎంతకాలమని నేను కాపురం చేయకుండా ఓపిక పట్టను."

"దైవవశాత్తు అట్లా జరిగింది. అనుభవించాలి. ఏనన్నా కలగన్నామా ఇట్లా జరుగుతుందని" పెద్దపాగి మాటలు మాట్లాడాడు నారాయణగారు.

"నాన్నగారు నా జీవితం నాశనం చేయటానికి తలపెడతారా? మీరే దీర్ఘంగా ఆలోచించండి" అని కాఫీ కప్పు ఖాళీ చేసి కుర్చీలోనుంచి లేచాడు గోపి.

నారాయణగారు కుర్చీలో ఆలోచిస్తూ కూర్చున్నాడు.

* * *

## 6

కమల ఒంటరిగా లేసులు అల్లుకుంటూ కూర్చున్నది. ఒకప్రక్కన మామగారు "అమ్మా...అమ్మా" అని మూలుగుతూ పడుకున్నాడు.

లేసులు అల్లుతోందన్నమాటేగాని ఆమె మనస్సంతా భర్త మోహన్‌మీద లగ్నమయింది.

"తను కాపరానికి వచ్చి యిన్ని సంవత్సరాలయిందే-

ఒక్కసారి తనని భర్త సరిగా పలకరించి ఎఱుగడే" అన్న బాధ ఆమెలో ఎక్కువైంది. ఇదివరకు ఉన్న ధైర్యం నశించింది. ఆమెలో భర్త అంటే స్నేహభావం ప్రబలిపోయింది. సంసారమంటేనే ఆమెకు విరక్తి కలిగింది అప్పుడప్పుడు "రామకృష్ణ చరిత్ర, శారదాదేవి సూక్తులు" మొదలగు గ్రంథాలు చదునారంభించింది. మనశ్శాంతి లేనప్పుడు మానవుల మనస్సులు వేదాంతము వైపు పరుగెత్తునని ఆమె నిరూపించింది. తీరికసమయములలో అప్పుడప్పుడు 'క్రాస్ వర్డ్సు' పూర్తిచేసి పంపేది.

"కమలా...కమలా" అని గట్టిగా కేక వేసారు మామగారు.

"వస్తున్నా...వస్తున్నా" అని సమాధానం చెప్పి అల్లుతున్న లేసు అక్కడ పడవేసి లోపలిగదిలోనికి వెళ్ళింది కమల.

డబ్బాలో గ్లూకోజు సీసాలో వేసి ఆయన నోరు తెరపించి గొంతుకలో పోసింది.

బయటనుంచి "పోస్టుమాన్" కేక వేసాడు. "భర్త దగ్గరనుంచి ఉత్తరము ఏమన్నా వచ్చిందేమో. ఆరోగ్యం ఎట్లా ఉన్నదో" అని కంగారుపడి వచ్చింది కమల.

రిజిస్టరుకవరు సంతకం పెట్టి తీసుకుంది. లోపల చూస్తే భర్తదగ్గరనుంచీ ఉత్తరం లేదు. ఆమెకు "పజిల్స్"లో ఏడు వేల రూపాయలు బహుమానము వచ్చింది. దుఃఖము సంతోషము రెండూ కలిగినాయి. భర్తయింటిదగ్గర ఉంటే ఎంత సంతోషపడేవాడో అని ఆమె మనస్సులో దుఃఖపడ్డది. దానిలోనే 'ఫోటో' పంపవలసిందని ఉత్తరం వ్రాసి ఉంది.

లోపలనుంచి మామగారు "కమలా... అబ్బాయి ఎట్లా ఉన్నాడు" అని కేక వేసారు.

ఆమె ఆయనని నిరుత్సాహపఱచటం దేనికని కులాసాగానే ఉన్నారు" అని తెలియజేసింది.

  

హాలులో మంచముమీద మోహన్ పడుకొనిఉన్నాడు. ప్రక్కనే కుర్చీ వేసుకొని సుజాత కూర్చుంది. మోహన్‌కి ఒళ్ళు తెలియని జ్వరం. రాత్రి 'వంటిగంటకు' ఇంటికి వచ్చాడు. వస్తూనే మంచంమీద పడక వేశాడు.

"ఉడుకులాం సీసా తెచ్చి మోహన్ నుదుటిమీద పట్టీ వేసింది." మోహన్‌కు కొంచెం తెలివివచ్చింది. వాకిట్లో డాక్టరుగారి కారు ఆగింది. సుజాత కారుచప్పుడు విని క్రిందకు వచ్చి డాక్టరుగారిని పైకి తీసుకువెళ్ళింది.

డాక్టరు మోహన్‌ను పరీక్షచేసి మందుచీటి వ్రాసి యిచ్చారు. "ఈ పూటకి ఈ మందు వాడండి" అని మిక్చర్ తీసి యిచ్చాడు.

"మీరు ఒకసారి ఇటురండి" సుజాతని యివతలకి పిలిచాడు.

సుజాతకు భయంవేసి గుండె అధికంగా కొట్టుకోనారంభించింది.

"ఈయన మీకు ఏమవుతాడు?"

సుజాతకి ఏమి సమాధానము చెప్పాలో తెలియక సందిగ్ధావస్థలో పడ్డది,

"ఏమీ కాదు. తెలిసినవారు" అని సమాధాన మిచ్చింది. డాక్టరు తెల్లముఖంవేసి ఆమెవంక తేరిపారి చూసాడు. ఏమి చెప్పాలో తెలియలేదు. తనవృత్తిధర్మం కనుక చెప్పాలి అని సమాధానపరచుకొన్నాడు.

"ఈయన ఆరోగ్యపరిస్థితి ఏమీ బాగుండలేదు. అన్ని దుర్వ్యసనములు ఉన్నట్లు కనిపిస్తున్నాడు. రేపు మందుకి హాస్పిటలుకి పంపించండి" అని చెప్పి డాక్టరుగారు క్రిందికి దిగి పోయాడు.

డాక్టరు చెప్పినమాటలు సుజాతని కలతపెట్టినాయి. "అన్ని దుర్వ్యసనములు" అన్నమాట ఆమె కర్ణములలో ప్రతిధ్వనించింది. ఆమెను మోహన్ అంటే స్నేహభావం ఆవరించింది. కాని ఆపదలో ఉన్న అతనిని రక్షించటం తన ధర్మం అనుకున్నది. మనస్సు కుదుటపరచుకొని మోహన్ పడుకున్న మంచందగ్గరకు వెళ్ళి సీసాలోని మందు గ్లాసులోపోసి అతనికిచ్చింది. మోహన్ మందు రెండుగుటకలలో మ్రింగాడు. పేపరు కుర్రవాడు పేపరు తెచ్చి హాలులో పడవేసి వెళ్ళాడు.

"సుజాతా. పేపరు ఒకసారి ఇవ్వవూ?"

"ఇప్పుడు పేపరు చదివితే తలనొప్పివస్తుంది. పడుకో మోహన్" అని సమాధానం యిచ్చింది.

"లేదు" అన్నట్లుగా తల ఊపాడు.

అతని ఆతృతను గ్రహించి పేపరు తీసుకువచ్చి అతని చేతికిచ్చింది. మోహన్ పేపరు తెరచి చూసాడు.

మధ్యపేజీలో "గొప్ప బహుమతి" అని పైన వ్రాసి క్రింద 'వి. కమల.' ఆగిరిపల్లి అని పేరు వ్రాసిఉంది.

మోహన్ గుండె వేగము అధికమయింది. పేపరు గబ గబా క్రింద పడేసాడు. ఇదంతా చూస్తున్న సుజాత పేపరు పైకి తీసింది. ఫోటో క్రింద పేరు వి. కమల అని వ్రాసి ఉంది. సుజాత ఆశ్చర్యంతో "నీ చెల్లెలు కమల ఈమేనా !" అని ప్రశ్నించింది.

మోహన్ ఆశ్చర్యపోయి ఆమెవంక చూసాడు.

"ఏడు వేల బహుమతి" అతన్ని ఆకర్షించింది. ఉన్న సంగతి ఆమెకు చెప్పివేద్దామనుకున్నాడు.

"సుజాతా, నాకు పెళ్ళిఅయింది."

ఈ మాటలు వింటున్న సుజాతకి మతి చెడినట్లయింది.

"అట్లా చూస్తావేం సుజాతా! కమల నా భార్య. ఆమె దగ్గర డబ్బు తీసుకువచ్చి వైద్యం చేయించుకుంటానని చెప్పి దుర్వ్యసనాలకి లోనయ్యా."

సుజాతకి ఈ సారి మనస్సు సొంతం పట్టుతప్పింది.

"మోహన్ ... మోహన్ ... ఏమిటి మాట్లాడుతు న్నావ్."

"నిజం...సత్యం మాట్లాడుతున్నా".

"సుజాతా, నేను నీ చేత చాకిరీ చేయించుకొని ఎక్కువ కాలం బాధపెట్టటం యిష్టంలేదు."

"మోహన్ నీవు నాకు తమ్ముడులాంటివాడివి పడుకో

ఫరవాలేదు" అని సుజాత మోహన్ ఒంటిమీద చేయివేసి చూచింది. జ్వరం తీవ్రంగా ఉన్నది.

సుజాత మాటలు విని మోహన్ చిరునగవు నవ్వాడు.

"నేను డాక్టరుదగ్గరకు వెళ్ళి మందు తీసుకువస్తా జాగ్రత్త" అని సుజాత క్రిందకు దిగింది.

# 7

నారాయణగారింట్లో సందడి ఎక్కువైంది. ఊరిలో జనం, బంధువులు అంతా వచ్చి గోపిని సముదాయించటం మొదలుపెట్టారు. అతనిలో ఏమాత్రము మార్పురాలేదు. నారాయణగారు దిగులుగా కుర్చీలో కూలబడ్డాడు. మరొక ప్రక్కన ఆయనభార్య కంట తడిపెట్టుకొని కూర్చుంది.

నారాయణగారి కోడలు బట్టలు, పెట్టె సర్దుకొని మామ గారి కాళ్ళకి దణ్ణంపెట్టి "మామగారూ, నేను వెళ్ళవలసిందేగా" అన్నది.

నారాయణగారు మొగవాడైనా కళ్ళవెంబడి నీరు కార్చి "వెళ్ళమ్మా...మమ్మల్ని మరచిపో" అన్నాడు.

ప్రక్కనున్న నారాయణగారి భార్య 'బావురు'మని ఏడ్వసాగింది. విజయ గోపిదగ్గరకు వచ్చి "ఏమండీ నేను వెళ్తు న్నాను. మీరు పెళ్ళి చేసుకొని ఆనందించండి, సుఖపడండి ఇవే నా దీవెనలు."

గోపి కంట తడిపెట్టి ముఖమెత్తి మాట్లాడలేక తల క్రిందకు వంచేసాడు.

విజయ వాకిట్లో బండి ఎక్కింది. చుట్టూఉన్న

జనం అంతా కంట తడిపెట్టారు. బండివానిని తోలమని సంజ్ఞ చేసింది. బండీ కదిలింది. ఎవరిండ్లకు వాళ్ళు వెళ్ళిపోయారు. ఆమెను ఒకే ప్రశ్న మధన పెట్టింది. పుట్టింటికి వెళ్ళిపోమని ఆజ్ఞాపించటం భర్త తప్పా? తనకు రోగం కలిగించిన సృష్టికర్తది తప్పా? "ఎవరిది తప్పు?" ఆమె సమాధానముకొరకై ఆలోచిస్తూ కూర్చున్నది. బండి ముందుకు సాగింది.

♦ ♦ ♦

మోహన్‌కి జబ్బు నయమయింది. సుజాతకి తను ఏమి ఋణపడిఉన్నానో అని ఆలోచించటం మొదలుపెట్టాడు. "సుజాతా నీ ఋణం ఎలా తీర్చుకోగలను?" ఆమె చిరునగవు నవ్వి "నాకు ఆనందం చేకూర్చేపని చేయగలవా" అన్నది.

"ప్రాణం అయినా సరే యిస్తా."

ఆమె నవ్వి "నీవు యింటికి వెళ్ళి నీ భార్యని సుఖపెట్టి నువ్వు సుఖపడు" అన్నది.

సుజాతకోరిక మోహన్‌ని ఆశ్చర్యచకితునిచేసింది. మరల మాట్లాడలేకపోయాడు. 'తప్పకుండా చేస్తా సుజాతా' అని కాళ్ళమీద పడ్డాడు.

సుజాత, మోహన్‌లు యిద్దరూ మోహన్ ఊరు ప్రయాణమయ్యారు. సుజాత మనస్సులో ఒకే ప్రశ్న మధన పెట్టింది. "మోహన్ భార్య అతనికి డబ్బు యిచ్చి పంపించటం తప్పా?" మోహన్‌ను తీసుకువెళ్ళి తిరిగి ఆమెకు అప్పగించటం తన తప్పా?"

"ఎవరిది తప్పు?" టాక్సీలో ఆలోచిస్తూ కూర్చున్నది.

—...—

# అపోహ

ఆదివారం ఆఫీసుకు శెలవుదినం. సహజంగా శెలవుదినం అనేసరికి ప్రతి ఆఫీసరుదగ్గరనుంచి గుమాస్తావరకు ఎక్కడలేని ఆనందం ఉత్సాహం పెల్లుబుకుకొస్తాయి. గదిలో ఒకప్రక్క పడకమంచం, కుర్చీ, మరొకప్రక్కన వంటసామాను అమర్చి ఉన్నాయ్. సుజాతకి శెలవుదినం అవడంమూలాన ఎక్కడలేని ఆనందం ఆమెముఖం వ్యక్తపరుస్తోంది. గదిలో మూల ఉన్న ఎలక్ట్రిక్ స్టవ్ మీద కాఫీనీళ్ళుపెట్టి పేపరు తీసుకొని కుర్చీలో కూలబడ్డది సుజాత.

ఇంతలోకి బయటనుంచి ''సుజాతా! సుజాతా!'' అని కేక వినబడింది. అప్రయత్నంగా కేక వినేసరికి ఆమె ఒక్కసారి ఉలిక్కిపడింది. వెంటనే ఆ కంఠధ్వని పరిచితమైనట్లుగా సుజాత మనస్సుకు తట్టింది. ఆమెను ఆవరించిన భయం పటాపంచలయింది. కుర్చీలోనుంచి నిర్భయంగా లేచి వాకిటితలుపు తీసింది. ఎదురుగుండా ఆరడుగుల మనిషి, అందమైన ముఖము, విశాలమైన నుదురు; యవ్వనాన్ని తెలియపరచుచున్న తేజో ముఖము, సన్నని గ్లాస్కోపంచ, లాల్చీ ధరించి గుమ్మందగ్గర నుంచున్నాడు మోహన్.

"లోపలికి ప్రవేశించవచ్చా" అని హాస్యాస్పదంగా అన్నాడు మోహన్.

"అకే లోపలికి ఒంటరి స్త్రీ ఉండగా రాకూడదే" అని నవ్వుతూ అన్నది సుజాత.

"ఎన్నాళ్ళనాటి శాస్త్రాలు గుర్తుకు తెస్తున్నావ్ సుజాతా" అంటూ లోపలికి ప్రవేశించాడు మోహన్. పడక కుర్చీలో కూలబడ్డాడు మోహన్. ఎదురుగుండా మంచము వాల్చుకొని కూర్చుంది సుజాత.

"ప్రొద్దున భోజనానికి వస్తానని రాలేదేం మోహన్" అని, బాధ అంతా ఆమె మాటల్లోనే ఉట్టిపడుతోండా అన్న ట్లుగా మాట్లాడింది సుజాత.

"రాత్రి అనుకోకుండా మా యింటికి బంధువులు వచ్చారు. అందుమూలాన రాలేకపోయాను. క్షమించు సుజాతా" అని ఆమెచేతిని పుచ్చుకున్నాడు,

ఆమె ఒడలు జలదరించింది. మరుక్షణంలోనే "క్షమించు" అనేమాట జ్ఞప్తికి రాగానే మనస్సులో బాధపడింది.

"ఇంతలోనే క్షమించటం దేనికి. నీకు మాట్లాడడం చేతగాదు. మోహన్" అని పూర్తిచేసింది సుజాత.

"మాట్లాడటం చేతగాదు" అనేమాట వినబడేసరికి అతని మనస్సు లజ్జపడింది.

"నీకు మాట్లాడటం బాగా చేతనవుతుందిలే" అని మంచంమీది పేపరు అందుకున్నాడు మోహన్.

"ఇప్పటినుంచే ఇంత కోపం అవుతే ఎట్లా ?...కాఫీ తీసుకువస్తా" అని స్టవ్ దగ్గరకు వెళ్ళింది సుజాత. కాఫీ మాట

చెవున వినపడేసరికి పేపరు క్రింద పడవేసి పైకి చూసాడు మోహన్. ఆమెముఖంకేసి చూచేసరికి అతని మనస్సుకు నిగ్రహం లేకపోయింది. నిండుయవ్వనాన్ని వెలిబుచ్చుతున్న ఆమె ముఖం, నున్నని గులాబిరంగు చెక్కిళ్ళు, ఉంగరాలు, ఉంగరాలుగ తిరిగిన నొక్కులజుట్టు, ఇవన్నీ ఒక్కసారిగ మోహన్‌ని కలత చెందించినాయి. ఇంత అందంగా ఆమెను ఎప్పుడూ చూడలేదు. ఇంతలోకి రెండుకప్పులతో కాఫీ పోసి తీసుకువచ్చింది సుజాత. ఆమె ముఖంకేసి చూస్తూ కూర్చు న్నాడు మోహన్.

"ఏమిటీ అట్లా చూస్తున్నావ్. నా ముఖాన ఏమన్నా ఉన్నాయా ? ఇదిగో కాఫీ" అని అతనిచేతికి కాఫీ కప్పుయిచ్చి మంచము కూర్చున్నది సుజాత.

తన అజ్ఞానానికి సిగ్గుపడి ఉలిక్కిపడి లేచి ఆమెచేతిలోని కాఫీ కప్పు అందుకున్నాడు మోహన్.

ఇద్దరూ కప్పులు ఖాళీచేసి క్రిందపెట్టారు. ఇద్దరిచేతులూ ఒక్కసారి ఎదురుగుండా ఉన్న వక్కపొడి డబ్బాలోకి వెళ్ళి నాయ్.

"నేను యిస్తానుగా అంతకష్టం దేనికి?" అని డబ్బాలో వక్కపొడి తీసి అతని నోటిలో వేసింది. ఈసారి అతని మన స్సుకి పట్టు సొంతం తప్పిపోయింది. ఒక్కసారిగా "సుజాతా" అని ఆమెను తన హృదయానికి హత్తుకున్నాడు మోహన్.

ఈ విషయం అప్రయత్నంగా యిద్దరికీ తెలియకుండా జరిగిపోయింది. ఎదురుగుండా ఉన్న గూట్లో పిల్లి తన పిల్లల్ని వెంటవేసుకొని ప్రేమనంతటినీ వెలిబుచ్చుతూ నాలికతో

నాకుతూ కూర్చుంది. ఇద్దరికళ్ళూ ఒక్కసారి ఎదురుగుండా ఉన్న గూటివైపు పడేసరికి సిగ్గుపడి లేచారు.

మోహన్ చేతినున్న గడియారంవంక చూసాడు. చిన్న ముల్లు నాలుగు, పెద్దముల్లు పన్నెండు చూపించాయి. "ఇక వస్తా సుజాతా! నా స్నేహితుడు నాలుగుగంటలకి వస్తా నన్నాడు" అని గుమ్మందగ్గిరకు వచ్చాడు. సుజాత యిష్టం లేనట్టుగా "సరే" అని గుమ్మందగ్గరకు వచ్చింది. సైకిలు ఎక్కి "టా...టా..." అన్నాడు మోహన్. తిరిగి "టా... టా..." చెప్పి లోపలికి వచ్చింది సుజాత.

♦ ♦ ♦

పెద్దభవనం. ఇంటిముందర పూలచెట్ల తీగలతో అమర్చబడిన ఆర్చీలు; గేటు కిరుప్రక్కలూ రెండుసింహాలు, బయటగోడకు లాయర్ కరుణాకర్ ఎం.ఎ., యల్.యల్.బి, అని బోర్డు కట్టిఉంది. కరుణాకర్ పేరుమోసిన ప్లీడరు. ప్రాక్టీసుకు అంతులేదు. కాని అతనిమీాది అపవాదులకుకూడా లెఖ్ఖ లేదు. ఇరుపక్షాలవైపూ డబ్బు తీసుకుంటాడని పేరు. కాని జనంమాటుకు విరగబడి వెళ్తారు.

"ప్లీడరుగారూ! నా కేసు అట్లా చేసారు ఏమిటండీ?" అని నెమ్మదిగా అడిగాడు సుధాకర్.

"నేను చేసినదేమున్నదండీ. ఆ జడ్జీగారు క్రొత్తాయన వచ్చాడు. ఆయనకి శాస్త్రము, న్యాయము సరిగా తెలియదు. నా శాయశక్తులా కృషిచేశాను" అన్నాడు కరుణాకర్.

"ఎన్నో ఆశలుపెట్టుకొని మీా దగ్గరకు వచ్చాను. కేసు గెలిపిస్తారు కదా అని ఊహించాను. నా ఊహకి తగ్గ ప్రతిఫలమే

యిచ్చారు. ఈ విషయం నాకు ముందరే తెలిసినట్టయితే అసలు..." అని ఆవేశపూరితంగా ఏదో అనబోయాడు సుధాకర్.

"ఏ విషయం ?" అని సుధాకర్ మాట పూర్తికాక ముందే ప్రశ్నించాడు కరుణాకర్.

"ఏ విషయమున్నది! లోకులంతా చెప్పుకుంటున్న విషయమే..."

కరుణాకర్ నిర్ఘాంతపోయాడు. ఏమి సమాధానము చెప్పాలో తెలియలేదు.

"ఏ విషయం సుధాకర్" అని అదుర్దాగా అడిగాడు.
"ఆ విషయమే! మీరు యిరుపక్షాలవైపు ధనం తీసుకుంటారని !! మీరు ఇంత విశ్వాసఘాతకులని నేను ఊహించలేదు. ఇక మీతో మాట్లాడటానికికూడా నా మనస్సు ఒల్లడంలేదు. వెళ్ళివస్తాను. నా స్నేహితుడు మోహన్ నాకోసం వేచి ఉంటాడు" అని సుధాకర్ వెళ్ళిపోయాడు. కరుణాకర్ ఆశ్చర్యపోయి తలుపు వేశాడు.

♦ ♦ ♦

"హల్లో...సుధాకర్; రా" అని ఎదురుగుండా కుర్చీ చూపించాడు మోహన్.

"నిన్న సాయంత్రం ఎక్కడకి సైకిలుమీద వెళ్ళున్నావ్?" అని నోట్లోనుంచి గప్పున సిగరెట్టుపొగ వదులుతూ ప్రశ్నించాడు సుధాకర్.

ఆ సిగరెట్టు పొగ ఘాటుకి ఊపిరిఆడక పదినిమిషాల దాక సమాధానం చెప్పలేపోయాడు మోహన్. కొంచెము సేపు అయినతరువాత తటపటాయించుకొని "ఊరుచివర ఉన్న నా స్నేహితుడి యింటిదగ్గరకు వెళ్ళాను" అని సిగరెట్టు పొగ లోపలికి వెళ్ళటం మూలాన దగ్గుతూ సమాధానమిచ్చాడు మోహన్.

"ఎవరూ ఆ స్నేహితుడు ?"

"ఏం దేనికి ?"

"ఏం చెప్పకూడదా ?"

"చెప్పకూడని దేమున్నది. నీకు అంతగా తెలుసుకోవాలని ఉంటే నేను మట్టుకు దాచటం దేనికి! సుధాకర్ నిన్ను బాల్యస్నేహం మరచిపోయాననుకున్నావా... లేదు... నా మనస్సులో ఒకసారి నమ్మిన మనిషిని ఆ జన్మాంతము మరచిపోను. నన్ను స్నేహితులని అంత చప్పున మరచిపోయేవాడిగా తలచావన్నమాట?"

"దీనికి అంత ఆవేశం దేనికి మోహన్ ?"

"ఆవేశమేమున్నది? ఇదిగో ఇటుచూడు. ఎదురుగుండా కనబడుతున్న వీధిలో చివరిభాగంలో ఉన్న ఆ పెంకుటింట్లోని యువతి; నా..." అని పూర్తిచేయబోయాడు.

"ఆ...ఆ..." అని ఉలిక్కిపడినవానిలాగా కుర్చీలో నుంచి కొంచెము పైకిలేచాడు సుధాకర్.

అతని ముఖకవళికలు చూచేసరికి మోహన్ గుండెల్లో రాయిపడినట్లయింది.

"ఆమెపేరు నీకు తెలుసా?" అన్నాడు మోహన్.

"లేదు. తెలియదు" అని కృత్రిమంగా దగ్గుతూ, మరల సిగరెట్టుపొగ వదిలాడు సుధాకర్.

"ఆ యువతి బి.ఏ., ప్యాసయింది. నాతోపాటు యు. డి. సి. గా పనిచేస్తోంది, ఆమె ఒకతే ఉంటోంది. మేనత్త ఒకామె ప్రక్కఊరిలో ఉంటోంది. ఆమెకు పిల్లలు లేరు. ఆస్తిఉంది. ఆ ఆస్తి ఈమెకే దక్కుతుంది. ఆ యువతి..." అని పూర్తి చేయబోయాడు మోహన్.

"అయితే కొంపతీసి ప్రేమించలేదు గదా?" అని ఆశ్చర్యంగా అడిగాడు సుధాకర్.

"ఏం ప్రేమిస్తే?..."

"ఏం లేదు. సరే కానీ..." అన్నాడు సుధాకర్.

"ఆమె ఆఫీసులో నా డివిజన్‌లోనే పనిచేస్తోంది. ఎక్కువగా నాతో తప్ప మరెవరితోనూ మాట్లాడేది గాదు. మేం యిద్దరం కలసి మాట్లాడుతూఉంటే మిగతవారంతా మమ్మల్ని చూసి అసూయపడేవారు. ఆమె పూర్తిగా నాకు మనసిచ్చింది. నన్ను తప్ప వేరొకనిని పెండ్లాడనని చెప్పింది. ఆమె అందాన్ని చూచేసరికి నా మనస్సుకి నిగ్రహం లేకపోయింది. నేను కూడా ఆమెకు వాగ్దానంచేశాను. ఆ నాటినుండి మాయిద్దరి మనస్సులు కలసినాయ్..." అని పూర్తిచేసాడు మోహన్.

"ఎంత అజ్ఞానకూపంలో పడిపోయావ్ మోహన్? నీ మనస్సుకి యింత నిగ్రహం లేదని నేను కలలోకూడా ఊహించ లేదు. నీవు ఇంతచిన్న విషయాన్ని చర్చించకుండా సమాధానపడ్తా వనుకోలేదు. మోహన్; నీ బాగుకోరి చెప్తాను. వింటావా..."

"ఏం జరిగింది సుధాకర్? నా దగ్గర దాపరికం దేనికి? నేను ఎవరికైనా ద్రోహంచేస్తే అతనిని తిరిగి కాపాడటానికి ప్రాణాలిస్తా. నాకు ఎవరైనా ద్రోహంచేస్తే పూర్తిగా నాశనం చేసి తీరుతా" అని ఎక్కడలేని ఆవేశం తెచ్చుకున్నాడు మోహన్.

"తొందరపడకు మోహన్...ఆవేశం అన్ని సమయాలలో పనికిరాదు. నెమ్మదిగా ఆలోచించు. నీవు ప్రేమించిన యువతి కులట – ఆమె ద్రోహి. ప్రతిరోజూ శ్రీధర్ కనకారావు యింటికి వెళ్ళేది. వారిద్దరికీ సంబంధము ఉన్నట్లుగా నా చెల్లెలు లక్ష్మి చెప్పేది. ఇది నిజం. నీ క్షేమాన్ని ఆకాంక్షించి చెప్తున్నమాటలు యివి. దీన్ని నీ మనస్సులో ప్రశ్నించుకొని బాగోగులు నీవే ఆలోచించుకో. ఇక నేను వెళ్ళొస్తా..." అని కుర్చీలోనుంచి లేచాడు సుధాకర్.

మోహన్ తలవంచేశాడు. తలెత్తి సమాధానం చెప్ప లేకపోయాడు.

"సిగ్గుపడకు మోహన్. మించిపోయిన దేమీ లేదు. వెళ్ళొస్తా" అని సుధాకర్ సైకిలు ఎక్కాడు.

♦ ♦ ♦

కుర్చీలో కూలబడ్డాడు మోహన్. అతని మనస్సులో పెనుతుఫాను రేగింది. అంతరాత్మ వేసే ప్రతి చిన్న ప్రశ్నకీ అతని మనస్సు సమాధానం చెప్పలేకపోయింది. ఇంత అవమానాన్ని భరించటంకన్నా ప్రాణం త్యజించటం మేలనిపించింది. ఒక్కక్షణం గదిలో వుండలేకపోయాడు. అతని కాళ్ళు రెండూ వాకిటి గుమ్మంకేసి నడిచినాయ్. సరాసరి ఫర్లాంగు దూరము నడిచి వీథి చివరఉన్న పెంకుటింటి దగ్గర ఆగినాయ్. తలపైకెత్తి చూసాడు. తలుపుతాళం పెట్టి ఉంది. ఈ సారితో అతనిమనస్సులో మారుమూలదాగిన పాతభావాలు పటాపంచలు అయినాయ్. ప్రక్కింటివారమ్మాయి గుమ్మందగ్గిర కూర్చొని ఉన్నది. ఏడేండ్లపాప. సిల్కుగౌను తొడుక్కొని నుబ్బోస్తూ ఉంది. అక్కడే ఆడుకుంటూ కూర్చుంది.

"పాపా...ఇటు రామ్మా" అన్నాడు మోహన్.

చంటిపాప బెదరి తిరుగుముఖం పెట్టింది.

"భయంలేదు ఇటు రామ్మా...ఇవిగో బిళ్ళలు" అని గుప్పిటిమూసి ఆ పిల్లని భ్రమపెట్టాడు.

ఆ పాప బిళ్ళలకి ఆశపడి దగ్గరకు వెళ్ళింది?

"ఈయింటి ఆవిడ ఎక్కడకు వెళ్ళింది?"

"పిన్నిగారే...ప్రక్కసందులో ఉన్న ప్లీడరుగారింటికి వెళ్ళింది?" అని సమాధానమిచ్చింది ఆ పాప. ఆ పసిపాప సమాధానం అతనిమనస్సును విరిచేసింది. ఇదివరకుదాక అతనిలో ఉన్న ఆప్యాయత, ఆదరం, ఆవేశంగా మారినాయ్. అతని

ముఖం ఎఱ్ఱబడింది. అతని నేత్రాలు రెండూ చింతనిప్పులు లాగ మెరసినాయ్. పిల్ల చేతిలో 'కాఫీ' పెట్టి ప్లీడర్ కరుణాకర యింటికేసి వెళ్ళాడు మోహన్.

బయట హాలులోనే కరుణాకర్ ఆఫీసు, చుట్టూ నాయకుల ఫోటోలు; అటు యిటూ కుర్చీలు; కుర్చీలకి ఆనుకొని పుస్తకాలబీర్వాలతో హాలు నిండిపోయింది. అప్పుడే సుజాత ప్లీడరు కరుణాకర్‌తో మాట్లాడి అతనిచేతిలో డబ్బు పెట్ట బోతోంది. ఆ కాగితాలు యిద్దరిచేతుల మధ్యవుండగా మోహన కంటబడినాయ్. అతనికి పుండుమీద కారం పడినట్లయింది, హృదయానికి గాయంమీద మరొక గాయం తగిలింది. అతని మనస్సు పూర్తిగా వికలమయింది. ఇంటికి తిరుగుముఖం పట్టాడు.

"నేను వస్తానండీ... బాధ్యత అంతా మీ మీదనే పెడు తున్నాను"అని సుజాత గేటుబయటకు వచ్చింది. "సరేలెండి" అని ఆమెను గేటువరకు పంపి లోపలికి వెళ్ళాడు కరుణాకర్.

వారంరోజులయింది. మోహన్ దేవదాసుగా మారి పోయాడు. "ఇన్నిరోజులయింది గదా దానింటికి నేను వెళ్ళి. ప్రేమగలయువతి అయితే నన్ను చూడటానికి దేనికి రాదు?" అన్న ప్రశ్న అతనిని బాధించింది.

అతనికాళ్ళు రెండూ తిరిగి వీధిచివరనున్న పెంకుటింటి వైపు నడిచినాయ్. తలుపులు రెండూ దగ్గరకు వేసిఉన్నాయ్. తలుపుల్ని త్రోసి లోపలికి ప్రవేశించాడు మోహన్. సుజాత

లోపలకుర్చీలో కూర్చొని పేపరు చదువుతోంది. పేపరు క్రింద పడవేసి కుర్చీలోనుంచి లేచింది. మోహన్ ముఖంకేసి చూచేసరికి ఆమెకు ఎక్కడలేని ఆశ్చర్యం కలిగించింది. అతని కళ్ళు రెండూ గుంటలు బడినాయ్. ఆమె మనస్సులో మరు క్షణంలోనే జాలి ప్రవేశించింది.

"లోపలికి రా మోహన్. అక్కడ నుంచున్నావేం?"

"పరాయివాళ్ళు లోపలికి రావచ్చా!"

ఈ సమాధానం వినేసరికి ఆమె హృదయం వేగిరంగా కొట్టుకోవటం మొదలుపెట్టింది. కాళ్ళు వణక నారంభించి నాయి.

"మోహన్, నేను ఎవర్నో గుర్తుపట్టావా?"

"గుర్తుపట్టకేం? గుర్తుపట్టా. నీవు కులటవని తెలుసుకున్నా! మనసారా ప్రేమించానని మభ్యపరచి మోసంచేసిన ద్రోహి వని తెలుసుకున్నా. నీది హృదయం కాదు పాషాణమని గుర్తు పట్టా. నీవు నాదానివికాదు వేరొకరిదానివని తెలుసుకున్నా... ఆఖరుసారి నిన్ను చూచిపోదామని వచ్చా" అని అమితంగా దగ్గటం మొదలుపెట్టాడు. అతని సంభాషణ ఆమెకు ఏమీ అర్థంకాలేదు. ఏమి మాట్లాడాలో ఆమెకే తెలియలేదు. దగ్గటం మొదలుపెట్టాడు. "మోహన్ నీవు ఏమి మాట్లాడు తున్నావో తెలుసుకున్నావా" అని అడిగింది.

"ఆ తెలుసుకున్నా సుజాతా! నీవు కరుణాకర్

ప్రేయసినని తెలుసుకున్నా !" ఈసారి వాక్యం అతి ప్రయాస మీాద మాట్లాడాడు. అతని నోటిలోనుంచి నెత్తురుగడ్డగా పడింది.

సుజాతకి ఏమిచేయాలో తెలియలేదు. మోహన్ చేతిని పట్టుకొని మంచముమీాద పడుకోపెట్టి బయటగుమ్మందగ్గరకు వచ్చింది. ఆ దారినే సైకిల్ మీాద ఇంటికి వెళుతున్న సుధాకర్ కంటపడ్డాడు. అతనిని రెండుమూడుసార్లు కరుణాకర్ ఇంటి దగ్గర చూచింది.

"ఏమండీ ఇటు ఒకసారి వచ్చి సహాయముచేస్తారా ?" అని పిలిచింది.

సుధాకర్ సైకిలు వెనక్కి త్రిప్పి, లోపలికి ప్రవేశిం చాడు. ఎదురుగుండా మంచంమీాద పడుకున్న మోహన్‌ని చూచేసరికి అతని కళ్ళవెంబడి నీళ్ళుకారటం మొదలుపెట్టి నాయి. మోహన్ ఇంతపని చేస్తాడని, అతను కలలోకూడా ఊహించలేదు. ప్లీడరు కరుణాకర్ తనకేసులో డబ్బుతీసుకొని ఎదుటపక్షాన్ని గెలిపించాడనే కక్షతో వీరిద్దరిమధ్యా కక్ష్య పెట్టాడు.

సుధాకర్ మోహన్ మంచందగ్గరకు వచ్చాడు. అతని కాళ్ళ దగ్గర కూర్చొని "మోహన్ ! ఎందుకు ఇంత మహా అకృత్యము చేశావ్. నేను మహాపాపిని, క్రూరుడను, నాది హృదయం కాదు, పాషాణం. నీవు కరుణాకర్ మీాద కక్ష పూనెదవని మీా ఇద్దరిమధ్యా ప్రేమకు కక్షపెట్టాను" అన్నాడు.

ఈ మాటలు వింటున్న సుజాతకి ఏమీ పాలుపోలేదు. "ఏం జరిగింది సుధాకర్ ?" అని అతి ప్రయాసమీద మాట పూర్తిచేసాడు మోహన్.

"మోహన్! నా కేసులో కరుణాకర్ నా దగ్గర డబ్బు తీసుకొని ఎదురుపక్షాన్ని గెలిపించిన ద్రోహి. అతని ద్రోహానికి ప్రతీకారం చెయ్యాలని, మీ ఇద్దరిమధ్యా కక్ష్య పెడదామని సుజాతమీద లేనినేరం మోపా. సుజాత నిర్దోషి. ఆమె నేసత్త కేసుకొరకు కరుణాకర్ దగ్గరకు వచ్చినది కాని నీవు ఇంత మహాపాపకార్యానికి వడిగడతావని అనుకోలేదు" అని పూర్తిచేసాడు సుధాకర్.

"ఆ...ఎంత పనిచేశావ్ సుజాతా ?" అన్నాడు మోహన్. ఆమెదగ్గరకు వచ్చింది. "సుజాతా...సుజాతా..." దగ్గు ఎక్కువ అయింది. నోటిలోనుంచి రక్తం ధార పడుతోంది. "యూసిడ్ త్రాగా" అంటూ ఆఖరుసారి దగ్గి కళ్ళు మూసాడు.

ఈ దృశ్యాన్ని అంతా చూస్తున్న సుజాత లేతహృదయం తట్టుకోలేకపోయింది. ఆమె కాళ్ళు వణకనారంభించినవి. ఆమె గుండెవేగం అధికమై ఆఖరుసారి "మోహన్" అంటూ అతనికాళ్ళపై పడింది. ఆమెగుండె ఒక్కసారి ఆగిపోయింది. ఇద్దరినీ చూస్తూ నిల్చుండిపోయాడు సుధాకర్.

---

# బియ్యపు బస్తా

"ఏమండీ మిమ్మల్నే, మాట్లాడకుండా మొద్దులాగా కూర్చుంటారేం, ఇంట్లో చూడబోతె ఉప్పు మిరపకాయలకే కరువైంది. ఊళ్ళో చూడబోతే జమీందార్ అని పేరు. అయినా ఎందుకు చెప్పండి లేనిపోని దర్జాలు. అరువు తెచ్చుకున్న దర్జాలు ఎంతకాలం ఉంటాయి. ఈపూటకి బియ్యంలేవు. తీసుకువస్తే వండుతా; లేకపోతే అందాకా పస్తుపడుకుందాం" అని గంభీరోపన్యాసం దంచింది నళిని.

"ఏమేవ్; ఎందుకు అక్కసు పడుతావ్. ఈ లోకం సంగతి నీకు ఏం తెలుసు. వంటింట్లో కూర్చొని వంకాయ పులుసు, పచ్చడి కమ్మగానే చేయటం తెలుసు. అంతకన్నా ఎక్కువ తెలిసినదానివైతే ఇట్లా మాట్లాడుతావా! అయినా ఈ పూటకి కావలసింది బియ్యమేగా! ఒక బస్తాబియ్యం గంటలో నీ కాళ్ళముందర పడేయిస్తా. ఇదిగో ఇటుచూడు..." అని వాక్యం ముగించబోయాడు శేఖర్.

"శేఖర్ బాబూ! శేఖర్ బాబూ!" అని ఎవరో వాకిటి గుమ్మంతలుపు తట్టారు. నళిని వంటింట్లోకి వెళ్ళింది. శేఖర్ కుర్చీలోనుంచి లేచి వాకిటి తలుపుతీసాడు.

"శేఖర్ బాబూ... శేఖర్ బాబూ రక్షించాలి" అని మొదలుపెట్టాడు శేట్ జీ.

"లోపలికి రా శేట్ జీ, ఎందుకు కంగారుపడతావ్ రా కుర్చీలో కూర్చో" అని ఎదురుగుండా ఉన్న కుర్చీ యివతలికి లాగి తను కుర్చీలో కూర్చున్నాడు శేఖర్.

"నూ...ను బాబూ ఎవరో ఆఫీసరుట. టిప్‌టాప్‌గా బట్టలు వేసుకునివచ్చి పిలిచి లెఖలు చూపించు అని గదమా యించాను. లెఖలమాట చెప్పసపడేసరికి నా గుండె ఆగి పోయే పర్యంతం అయింది. ఈయన లొంగేట్లు లేదు. మీరే వచ్చి ఏమన్నా సహాయం చేయాలి. నన్ను ఈ సారికి రక్షిం చండి శేఖర్ జీ."

"ఎవరో వచ్చి లెఖలుఅడిగారా? మీకు వ్రాయ లేదా! అయితే ఆయన జైలుకి రమ్మన్నాడా! ఇదా మీ కేసు. సరే పదండి చూస్తాను" అని కుర్చీలోనుంచి లేవబోయాడు. "అన్నట్లు శేట్ జీ మరచిపోయాను. ఉన్న బట్టలు యిస్త్రీ చాకలివాడికి వేసాను. మరి బట్టలు లేవు. ఎట్లా వచ్చేది?"

"దానిదేముంది లెండి. మీరు ఇక్కడే ఉండండి ప్రక్కన రంగయ్య యిస్త్రీబట్టల లాండ్రీలో ఉలెన్ పాంటు సిల్కు చొక్కా అద్దెకు తీసుకువస్తా. నేను వచ్చేలోపల మీరు

ముఖం కడుక్కొని తయారుగా ఉండండి" అని బయటికి వెళ్ళాడు శేట్‌జీ.

"చూశావా నళినీ? లోకం అంటే ఏమిటో మరి- ఇలాంటి శేట్‌లు నలుగుతుంటేనే మనకు పొట్టనిండేది."

"అవునుమరి! ఇలాటి కేటులు నలుగుతుంటేనే అలాంటి శేట్‌లు మేడలు కట్టేది."

"ఇస్...ఆపు ఆయన వస్తున్నాడు" అని కుర్చీలో నుంచి లేచాడు శేఖర్.

"శేఖర్‌జీ ఇవిగో బట్టలు, తీసుకోండి. తొందరగా రండి" అని కంగారంతా ఆయన మాటల్లోనే ఉట్టిపడుతుండగా అన్నట్లుగా పూర్తిచేశాడు శేట్‌జీ.

శేట్‌జీ చేతిలోని బట్టలు అందుకొని లోపలికి వెళ్ళాడు శేఖర్.

"ఏమండీ ఎప్పుడైనా మీరు ఈ సిల్కు బట్టలు చూశారా? ఒక్కసారి తొడిగేస్తున్నారు" పరిహాసంగా అంది నళిని.

"ఇలాంటి సిల్కుబట్టలు సమయానికి తొడిగితేనే నీకు అలాటి కొత్తచీరెలు వచ్చేవి" అని చమత్కారంగా సమాధాన మిచ్చి తలజుట్టు సరిగా సద్దుకొని గదిలోనుంచి బయటకు వచ్చాడు శేఖరు,

చప్పుగ రండి శేఖర్‌జీ అని కుర్చీలోనుంచి లేచి ఇద్దరూ కలిసి కొట్టుకు వెళ్లారు.

* * *

కొట్టుదగ్గర కుర్చీలో అటూ యిటూ దిక్కులు చూస్తూ కూర్చున్నాడు యిన్స్పెక్టర్ మోహన్.

"ఏమయ్యా శేట్? నాకు పుస్తకాలు తీసుకువస్తానని యింతసేపు కూర్చోపెట్టాడు" అని విసుగు అంతా అతని మాటల్లోనే ఉందా అన్నట్లుగా మాట్లాడాడు యిన్స్పెక్టర్.

"లేదు బాబు. వస్తూ ఉంటారు. నడచి రావాలి కదా. ఆలస్యమయి ఉంటుంది" అని భయం, వినయం రెండూ అతని మాటల్లోనే మేళవించినాయా అన్నట్లుగా సమాధానమిచ్చాడు కొట్లో గుమాస్తా నాగేశ్వరరావు.

గుమాస్తా మాటలు వింటూ ఉండగానే వెనుక బూట్ల చప్పుడు వినబడేసరికి వెనక్కి తిరిగి చూసాడు యిన్స్పెక్టర్.

"హలో...గుడ్ మార్నింగ్ సర్" అని తిరిగి ఆచారముగ సమాధాన మిచ్చాడు యిన్స్పెక్టర్.

"కాఫీ తీసుకున్నారా ?"

"ఆ తీసుకున్నాలెండి" అని ముక్తసరిగా సమాధానమిచ్చాడు యిన్స్పెక్టర్ మోహన్.

ఇన్స్పెక్టర్ మాటల్లోని భావాన్ని గ్రహించాడు శేఖరు. "శేట్‌గారూ; రెండుకాఫీలు తెప్పించండి" అన్నాడు.

"ఏయ్ కుర్రాడూ! రెండు స్పెషల్ మసాలాదోసెలు కాఫీ తీసుకురా" అని గల్లాపెట్టెలోనుంచి డబ్బుతీసి కుర్రాడి చేతికిచ్చాడు శేట్‌జీ.

"మీరు ఎవరండీ?" అని శేట్‌కేసి తిరిగి ప్రశ్నించాడు యిన్‌స్పెక్టర్.

ఏమి చెప్పాలో తెలియక అటు యిటూ చూస్తూ నుంచున్నాడు శేట్‌జీ.

ఆలస్యం చేయటానికి ఇది సమయంకాదని గ్రహించాడు శేఖరు. తనని తానే పరిచయం చేసుకోవలసివచ్చింది.

"నా పేరు శేఖరు. నే సంగతే ఈ తాలూకాలో నూరింట తొంబదిమందికి పరిచయమే..." అని పూర్తిచేసాడు.

"ఓ. శేఖరుగారంటే మీరేనా. మొన్న మా ఊరు వచ్చి ఉపన్యాసం చెప్పారుట" అన్నాడు యిన్‌స్పెక్టరు.

"అవును. ఒక ఊరేమిటి. ఈ తాలూకాలోని ఊళ్ళన్నీ తిరుగుతూ ఉంటూ, వేటినిగురించో ఉపన్యాసాలు చెప్పమని ప్రాణాలు తీస్తే వీలు తప్పక వచ్చి చెప్తూ ఉంటాను లెండి" అని పూర్తిచేసాడు.

ఇంతలోకి చేతిలో టిఫిన్; కాఫీ పుచ్చుకొని ప్రవేశించాడు హోటల్ బాయ్. అయిదునిమిషాలలో యిద్దరూ కాఫీ గ్లాసులు ఖాళీచేసారు.

"మా యింటికి వెళ్దాం రండి" అన్నాడు శేఖరు.

ఇద్దరూ కుర్చీలలోనుంచి లేచి మెట్లు దిగారు. శేట్‌జీ ఆనందానికి అంతులేదు.

* * *

తెల్లవారింది. రాత్రి ప్రక్కింటి ఆవిడను అడిగి బదులుకి బియ్యం తీసుకువచ్చింది నళిని. ఈ పూటకి బియ్యంలేవు.

"ఇంకేము...యిస్త్రీ చొక్కా లాగూ వేసారు. బయటకు వెళ్ళి నలుగురి కళ్ళలో కారం కొట్టారు. రాత్రే బియ్యం నిండుకున్నాయని చెప్పాను. ఈ పూట బియ్యంలేవు. తీసుకువస్తే వండుతా; లేకపోతే..." అని పూర్తిచేయబోయింది నళిని.

ఇంతలోకి బయటనుంచి నెత్తిమీద మూటపెట్టుకొని కూలిమనిషి, వెనకనే శేట్‌జీ ప్రవేశించారు.

"రండి శేట్‌జీ" అని ఎదురుగుండా ఉన్న కుర్చీ లాగాడు శేఖరు.

"కూర్చుంటాలెండి. పనిఉంది. మూట లోపల పడవేయించమన్నారా!" అన్నాడు శేట్‌జీ.

"ఏం మూట అది?"

"బియ్యం మూట."

లోపలనుంచి వింటున్న నళిని ముఖం విప్పారింది. భర్త తెలివితేటలకు మనస్సులో అసూయపడింది.

"దేనికండీ...కాస్తదానికి బియ్యం కావాలా" అన్నాడు శేఖరు.

"నూరాట్ల లోపల పడవేయరా" అని [illegible] చేసి తిరిగాడు శేట్‌జీ. "ఇక వస్తానండి ఆలస్యమవుతుంది. [illegible] వెళ్ళాలి" అన్నాడు శేట్‌జీ. వెళ్ళిపోయాడు.

"చూశావా? బియ్యపుబస్తా ఎంతలోకివచ్చిందో. బస్తా లో ఉన్నది లోకంఅంతా. నాలుగుసరి బస్తాలు చేసేసరికి [illegible] మనుష్యులమయిపోయాం" అని నళిని భుజంమీద చెయ్యి వేశాడు శేఖరు.

"మంచి తెలివితేటలు సంపాదించారు కొంచెం" అని భర్త చేతులు తప్పించుకొని వంటింట్లోకి వెళ్ళింది నళిని.

